C

# సోవియట్ సమీక్ష

సోషలిజపు నూతన దృక్పథం

పెరిస్త్రోయికా యధాతథవాదులు

సోవియట్ యూనియన్‌లో
యువజనుల హక్కులు

సోవియట్ బౌద్ధుల జీవన సరళి

రష్యా భారతదేశ క్రైస్తవ
చర్చిల మధ్య సంబంధాలు



# సంబరాలు





FIRST AMERICAN PIZZA IN MOSCOW

Nationwide Franchises Available

తాష్కెంట్‌లో జరిగిన ఆసియా ఆఫ్రికా, లాటిన్ అమెరికాల 10వ అంతర్జాతీయ ఫిలిం ఉత్సవాలలో 90 కి పైగా దేశాల ప్రతినిధులు పాల్గొన్నారు. ఫొటోలో ఉజ్బెక్ ఆర్టిస్టులతో ఉత్సవంలో పాల్గొన్నవారు.

సోవియట్ యూనియన్‌లో ఇటీవల భారతదేశ ఉత్సవం జరిగిన సందర్భంగా "నాదేశం, నాప్రజ" అనే ఎగ్జిబిషన్‌ను తాష్కెంట్‌లో ఏర్పాటు చేశారు. ఫొటోలో, యీ ఎగ్జిబిషన్ నిర్వాహకులతో ముచ్చటిస్తున్న యువజనులు.

మాస్కోలో సోవియట్-అమెరికన్ సంయుక్త కేఫ్ "ఆస్ట్రోపిజా". ఫొటోలో, అమెరికన్ మేనేజర్ పాట్రిక్ పెరిట్టి, సోవియట్ డిప్యూటి మకారవ్,



# సోవియట్ సమీక్ష









అక్టోబరు 7 సోవియట్ రాజ్యాంగ దినోత్సవం. ఈ సంవత్సరం ఆ జాతీయ పర్వదినాన్ని సోవియట్ రాజ్య రాజకీయ వ్యవస్థ సమూల సంస్కరణ, యితోధిక ప్రజాస్వామ్యీకరణ పరిస్థితుల్లో పాటించారు. ఈ లక్ష్యాల సాధన, విస్తృత సామాజిక, ఆర్థిక కార్యక్రమాల అమలుకూ, సామాజిక న్యాయంగల సమాజ నిర్మాణానికీ, స్వేచ్ఛా, సమానత్వాలుగల ప్రజల నాగరిత నిర్మాణానికీ అవకాశాలను ఆవిష్కరిస్తుంది.

# ఈ సంచికలో







# ప్రపంచ వ్యాప్త ఘర్షణలను పరిష్కరించగలం

ప్రతిచోటా ప్రజలు ప్రపంచ భవితవ్యం గురించి ఆందోళన చెందుతున్నారు; సోవియట్-అమెరికా సంబంధాలు ప్రపంచంలో ఒక నిర్మాణాత్మక కారకం కావాలని కోరుతున్నారు. ప్రభుత్వ బహుమతి గ్రహీత అయిన అకడమీషియన్ నికిటా మొయిసేయేవ్, ఘర్షణ పరిస్థితులను అంతరింపజేసేందుకు గల అవకాశాలను గురించి అధ్యయనం చేస్తున్నారు.

తలపాటు, సహకారం ఒకే నాణేనికిగల రెండు పార్శ్వాలు. యిది విరుద్ధ శక్తుల గతి తార్కిక ఐక్యత. సమాజం పురోగమిస్తున్న కొద్దీ తలపాటు పద్ధతులూ, సహకార రూపాలూ పెరిగిపోయాయి; అంతకంతకూ యెక్కువ క్లిష్టమైనవి అయ్యాయి.

కొంతకాలంపాటు ఘర్షణ పరిస్థితుల (లక్ష్యాల, ప్రయోజనాల, ఆశలు, ఆకాంక్షల ఏకత లేని ఎలాంటి పరిస్థితి ఐనాసరే) పరిష్కారం అసంకల్పితంగా జరుగుతుండేది.

ఇప్పుడు, యే అనాలోచిత చర్యఅయినా సర్వనాశనానికి దారితీయగలదు. అందువల్ల అసంకల్పిత పరిష్కారాలు అనుమతించదగినవి కాదు. ఘర్షణ పరిస్థితుల పరిష్కారం (కనీసం ముఖ్యమైనవి) హేతుబద్ధంగానే ఉండాలి. ఘర్షణ పరిస్థితుల ఏ సమిష్టి పరిష్కారమైనా తప్పనిసరిగా రాజీ పరిష్కారమే అయి ఉండాలి. అయితే, అందరికీ ఆమోదయోగ్యంగా ఉండటానికి గాను ఈరాజీలో కొన్ని ప్రత్యేకాంశాలు ఉండాలి.

సమిష్టి పరిష్కారం అన్నిటికన్నా ముందు అందరికీ ఆమోదయోగ్యంగా ఉండాలి లేకపోతే పరిష్కారం కోసం కృషి జరపడం దండగవుతుంది. అంతేకాదు. యిలాంటి రాజీ కుదుర్చుకున్న పక్షాల్లో యే ఒక్కటైనా రాజీలో తాను చేసిన వాగ్దానాలను ఉల్లంఘిస్తే, అది దానికే హానికల్గించేదిగా వుండాలి. అటువంటి పరిష్కారం మాత్రమే, అన్ని పక్షాలూ తమ ప్రతినలను పాటించడానికి హామీ యివ్వగలదు. ఇలాంటి రాజీని స్థిరమైన రాజీ అని అంటారు.

అయితే, రాజీ అన్ని పక్షాలకూ, ఆమోదయోగ్యం కావాలంటే స్థిరత్వమొక్కటే చాలదు. అది అన్నిటికి సమానంగా ఫలప్రదమైనదిగా కూడా ఉండాలి.

ఈరెండు అంశాల సమ్మేళనను సాధించడం జీవితంలో బహు అరుదు. వివిధదేశాల ప్రజలు అంత అసహనంతో ఉండటానికీ, తరచుగా ఆయుధాలు చేబూనడానికీ కారణాల్లో యిది ఒకటి.

రాజీలను కనుగొనాలంటే దానికొక నిర్దిష్ట విజ్ఞానమూ, ప్రత్యేక పద్ధతులూ అవసరం. వీటిలో అనేకం యింకా కనుగొనాల్సి ఉంది. అందుకే స్థిరమైన, ఫలప్రదమైన రాజీలకు వీలుగల

ఘర్షణ పరిస్థితులను మనం విశ్లేషించనారంభించాం. యిలాంటి పరిస్థితులను మనం సహకార పరిస్థితులు అంటున్నాం. సహకార ఒడంబడికల మొత్తం సమ్మేళనను సహకార యంత్రాంగమనీ, లేదా సామరస్య వ్యవస్థ అనీ అంటాము.

సహకరించుకోగల పరిస్థితులు ఎన్నో ఉన్నాయని మనం త్వరలో తెలుసుకున్నాము. జీవ్యావరణాన్ని, యితర ప్రకృతి కారకాలను పరిగణనకు తీసుకో వలసిన పరిస్థితులు యిందుకొక ఉదాహరణ. అటువంటి తొట్టతొలి ఘర్షణ పరిస్థితిని సోవియట్ విజ్ఞానశాస్త్రాల అకాడమీ కంప్యూటర్ కేంద్రానికి చెందిన వై. హార్మేయ్యర్, ఐ. వతేయల్ విశేషించారు. ఆ ఘర్షణ పరిస్థితికి "ఒకే పడవ లోని ప్రయాణీకులు" అని ఆ తర్వాత పేరు పెట్టారు.

పడవలోని వారికి భిన్న ప్రయోజనాలున్నప్పటికీ, వారందరికీ ఉమ్మడి లక్ష్యం, ఎలాగైనా ఒడ్డును చేరుకోవాలనే లక్ష్యం ఉంది. యిదీ ఆ పరిస్థితి విశిష్ట లక్షణం. తమ లక్ష్యం సిద్ధించాలంటే వారు తమ వనరులలోని (ఆహారం, నీళ్ళు, దుస్తులు శక్తియుక్తులు వగైరా) ఒక భాగాన్ని కలిసి పంచుకోవలసి ఉంటుంది.

కాని, ఆయుధ పోటీవంటి అనేక ప్రపంచ ఘర్షణలు "పడవ సిద్ధాంతానికి" సంబంధించిన పరిస్థితికన్నా చాలా క్లిష్టమైనవి. అందువల్ల, వీటి విషయంలో ఇంతకన్నా మెరుగైన విశ్లేషణా పద్ధతులను వర్తింప చేయవలసి ఉంటుంది. పడవ సిద్ధాంత అనువర్తన ఆర్థిక, జీవ్యావరణ ఘర్షణలకు సరిపోతుంది. ఆయుధ పోటీవంటి ఘర్షణలను విశ్లేషించడానికి అనువైన నమూనా పరిస్థితిని ఊహించుకునేందుకు నేను ప్రయత్నించాను. దానికి నేను యెంచుకున్న సూత్రాలివి:

1. ఘర్షణలోని రాజ్యాలు తమ వనరులను తమ ఇష్టానుసారం వినియోగించుకోవచ్చు. అవి సర్వ స్వతంత్రమైనవి.

2. అన్ని రాజ్యాలు తమ సామాజిక వ్యవస్థలను, ప్రయోజనాలను, లక్ష్యాలను అట్టిపెట్టుకుంటాయి.

3. వాటి ప్రధాన ప్రయోజనాలు సమ్మిళితమై ఉన్న తీరు రకరకాలుగా ఉండవచ్చు. ఉదాహరణకు, సోషలిస్టు దేశాల విషయంలో ఆయుధ పోటీకి వనరులను తరలించడం వల్ల వాటి సామాజిక, ఆర్థిక కార్యక్రమాలు దెబ్బతింటాయి. పెట్టుబడిదారీ ఆర్థిక వ్యవస్థ విషయంలో ఆయుధాల కోసం భారీగా ఖర్చుపెట్టడం, అవసరం కాకపోయినా వాంఛనీయం కావచ్చు.

4. అన్ని దేశాలూ అణుయుద్ధ ప్రమాదాన్ని తగ్గించుకో చూస్తాయి. ఒక రాజీకి రావడానికి ఈ సూత్రం అతి ముఖ్యమైనది.

5. ప్రతి దేశం తన లక్ష్యాల సాధనకు తన ఆర్థిక వ్యవస్థపై ఆధారపడాలి. సైనికావసరాల కోసం ఎక్కువ వ్యయం చేసే కొద్దీ వాటి సామాజిక, తదితర కార్యక్రమాలకు వనరులు తగ్గిపోతాయి. యిదొక స్వయం విదిత మూలసూత్రం.

ఈ సూత్రాల ప్రాతిపదికపై నేను 1983లో ఒక భావనాత్మక గణిత శాస్త్రీయ నమూనాను రూపొందించాను. ఈ నమూనాను విశ్లేషించగా తేలిందేమిటంటే, అత్యంత సంక్లిష్టమూ, ప్రమాదకరమూ అయిన ఆయుధ పోటీలో ఉభయ పక్షాలకు ప్రయోజనకరమైన రాజీ పరిష్కారం సాధ్యం.

అయితే, సమస్యను పరిష్కరించడానికి యిది చాలదు. ఈరాజీ యెలా ఉండాలో కనుగొనాలి. ప్రత్యేకించి ఆయుధ పోటీలో పాల్గొంటున్న దేశాలకు ఆమోదకరమైన ఆయుధాల స్థాయిలను నిర్ధారణ చేయాలి. అందుకు, మనవద్ద వివరమైన సమాచారం ఉండాలి. అనేక పరిమాణ సూచీలు ఉండాలి. లోతైన పరిశోధన జరగాలి. అన్ని పక్షాలకు అనుకూలమైన రాజీసాధ్యమే అని తెలుసుకోవడమే, ప్రపంచ సమస్యలకు పరిష్కారాలను కనుగొనడానికి బలమైన ప్రేరణ కాగలదు. రాజీ సాధ్యం. దాన్ని మనం తుదకు కనుగొంటాము.

ఇక్కడ, ప్రొఫెసర్ మాలిషేవ్ తరచు చర్చించిన ఒక ముఖ్య షరతును పేర్కొన వలసి ఉంది. మనుషులు రకరకాలు కొందరు కయ్యానికి కాలు దువ్వేవారు వ్యక్తిగత అధికారం కోసం ప్రయత్నిస్తారు. చట్టాలను లెక్క చేయరు. మరి కొందరు, ప్రొఫెసర్ మాలిషేవ్ మాటల్లో చెప్పాలంటే "సామరస్యవాదులు". వారు ఘర్షణలను నివారించడానికై రాజీ పరిష్కారం కోసం పాటుపడతారు.

సమాజ ప్రగతిలో రెండు రకాల వారి పాత్ర చరిత్ర అంతటా మారుతూ వచ్చింది. ప్రాచీన రాతి యుగంలో జబర్దస్తీగా పెత్తనం చలాయించే వ్యక్తుల నాయకత్వం ప్రజల ఆమోదం పొందడమే కాదు. దాని అవసరం కూడ ఉండేది. కాని తరువాత, వారు మానవ ప్రగతికి ప్రతిబంధకాలు అయ్యారు. ఇందుకు చెంఘిజ్‌ఖాన్ తామర్లేన్‌లు ఉదాహరణలు. ఈనాడు అటువంటి వారు మొత్తం మానవాళికే ప్రమాదకరం.

ఒకే ఒక మనిషి అనాలోచిత చర్య మొత్తం మానవాళికి వినాశకరంగా పరిణమించే దశలో మనమున్నాం. అటువంటి మనిషికి పెత్తనం యివ్వడం ప్రమాదకరమని చాలామంది గుర్తిస్తున్నారు. అతను ఒక బటన్ నొక్కాడా ప్రాణాంతకమైన మిసిలీల ఆఖరు ప్రయాణం ప్రారంభమవుతుంది. ఇక ప్రపంచంలో మిగిలేదేదీ ఉండదు.

అందువల్లనే అధికారానికి, ఉన్నత నైతిక ప్రమాణాలుగల "సామరస్యవాదులను" ఎంపిక చేయాలని మాలిషేవ్ అంటున్నారు.

నేను ఆయనతో ఏకీభవిస్తున్నాను. మానవాళి అభివృద్ధిలోని భావిదశ, మన "నాయకులపై" ప్రత్యేక బాధ్యతలు మోపుతుందనీ, వారికి కొన్ని ప్రత్యేక లక్షణాలు అవసరమనీ నా అభిప్రాయం.

## మిహయిల్ గొర్బచేవ్

సోవియట్ ప్రజల మనసుల్లో అగ్రస్థానం వహిస్తున్న ప్రశ్న ఒకటుంది: యీ మూడేళ్ళలో నిర్వర్తించిన కృషిని, దానిబట్టి వేసే అంచనా యేమిటో వారికి వినాలని వుంది. యుద్ధప్రమాదం వెనక్కు నెట్టబడిందా అనేది ఆ ప్రశ్న. ఔను, ఖచ్చితంగా వెనక్కు నెట్టబడిందని దానికి మన సమాధానం.

ఈ సమాధానం యెందులో మూర్తి మంతమైంది? అన్నిటికన్న ముఖ్యంగా అంతర్జాతీయ వ్యవహారాల అక్షం, తలపాటునుంచి సహకార, పరస్పర అవగాహన, సంప్రతింపులవైపుగా మళ్ళుతుందన్న వాస్తవంలో యిది మూర్తిమంతమైంది. నిర్దిష్ట ఫలితాలను, ముఖ్యంగా సామూహిక విధ్వంసక ఆయుధాల విషయంలో నిర్దిష్ట ఫలితాలను యిస్తాయని యీ సంప్రతింపులు ఆశలు గొల్పుతున్నాయి. సోవియట్-అమెరికా సంబంధాలు మెరుగుపడ్డాయి. అణ్వాయుద్ధాల్లో ఒక భాగాన్ని నిర్మూలించాలన్న ఒప్పందం కుదిరింది. యూరపియన్ పరిణామక్రమం అంతర్రాజ్యస్థాయిలో, ప్రత్యేకించి ప్రభుత్వేతర స్థాయిలో మరింత చురుకుగా సాగుతోంది.

జెనీవా ఒప్పందాలూ, ఆఫ్ఘనిస్తాన్‌నుంచి మన సైనిక దళాల వుపసంహరణ ప్రారంభం కావడమూ ప్రాంతీయ ఘర్షణల రాజకీయ పరిష్కారంలో ఒక అంతర్జాతీయ ప్రాముఖ్యంగల మైలురాయి. మొత్తం ప్రపంచానికి ప్రమాదం తెచ్చి పెట్టగల ఈ ఘర్షణలు జాతుల ప్రగతిని అడ్డుకొంటున్నాయి.

సోవియట్ కమ్యూనిస్టుపార్టీ 19 వ అఖిల
యూనియన్ సమావేశానికి సమర్పించిన నివేదిక నుండి

# ఎంచుకునే స్వేచ్ఛ

వ్సెవొలోద్ ఓవ్ చిన్ని కోవ్,
ప్రావ్దా రాజకీయ విశ్లేషకుడు

తానే మార్గాన్ని అనుసరించాలి, తానే యాజమాన్య యాపాన్ని ఎంచుకోవాలి. తానే దేవుడున్ని ప్రార్థించాలి అన్న విషయాన్ని ప్రతిదేశ ప్రజానీకమూ స్వయంగా నిర్ణయించుకుంటుంది. భిన్న జీవన సరళినీ, భిన్న ఆశలనూ, ఆచర్యాలనూ స్వీకరించినవారిని భ్రష్టులుగా ప్రకటించే హక్కు ఎవరికీ లేదు. కజ్జాకోరుతనం, దురభిమానం, ఆత్మిక అసహనం అసను తప్ప మరెవరినీ ఆరాధించకూడదనే తత్వం మానవజాతి చరిత్రలోని అంధకారయుగాల నాటివి.

అంటు మానవాళియునుగడే ప్రశ్నార్థకంగా తయారైన అణు యుగంలో ఎంచుకునే స్వేచ్ఛ రాజకీయ విధాయకమూ, అంతర్జాతీయ సంబంధాల సార్వజనీన సూత్రమూ అయిపోయింది. ఇది వరకులాగా, భిన్న వ్యవస్థలూ, విలువల మధ్య పోటీ, యింకెంతమాత్రమూ యుద్ధానికి సాకు కారాదు. "కమ్యూనిస్టు కావడంకంటే చావడంమేలు" అన్న విషాదకరమైన నీతి సూత్రాన్ని కమ్యూనిస్టు వ్యతిరేక యుద్ధోన్మాదులు ప్రపచించిన అమెరికాలో "పెట్టుబడిదారీ విధాన భస్మపటలానికి సోషలిజం భస్మపటలానికీ తేడా తెలుసుకోవడం అసాధ్యం అన్న హెచ్చరిక ప్రస్తుతం విస్తృత ప్రచారంలో ఉండటం సూచనప్రాయంకాదా?

భావ సంఘర్షణ ప్రపంచ రాజకీయ వాతావరణంపై ప్రభావం నెరపకుండా ఉండదు. ప్రజలందరినీ ఒకేలా ఆలోచించేట్టు చేయడం అసాధ్యం కాబట్టి ఈ సంఘర్షణను రద్దు పర్చడంగానీ నిషేధించడంగానీ సాధ్యంకాదు. మానవాళి మనుగడకోసం పెట్టుబడిదారీ విధానం, సోషలిజాలు తమ భావజాలాలను బలిపెట్టాలని దీనర్థంకాదు. యావత్తు మానవాళి ప్రయోజనాలు యిమిడివున్న యుద్ధమూ, శాంతి సమస్య విషయానికి వచ్చినప్పుడు, పోటీపడుతున్న పక్షాలు భావజాల విభేదాలకు అతీతంగా ఉండాలనీ, అంతర్ రాజ్యా సంబంధాలను రూపుదిద్దడం పట్ల తమ భావజాలం నిర్దేశించే వైఖరులను వదిలించుకోవాలని దీనర్థం. పక్షపాత బుద్ధి, అసహనాల దౌత్య విధానాన్ని వదిలించుకోవడమంటే అర్థం ప్రతిరాజ్యానికి తన సామాజిక, రాజకీయ వ్యవస్థను ఎంచుకునే హక్కుందని గుర్తించడమన్న మాట.

ఎంచుకునే స్వేచ్ఛ అన్న భావనకునూతన ఆలోచనా ధోరణిలో కీలకస్థానం ఉంది. ఈ భావన కనీ వినీ ఎరుగని ప్రపంచ వైవిధ్యం నుంచీ ఆవిర్భవిస్తోంది. యుగ యుగాలుగా చరిత్ర రంగస్థలానికి వెనుక ఉండిపోయిన కోటానుకోట్ల ప్రజలు యిప్పుడు రంగస్థలంపైకి వస్తున్నారు. యెల్లెడలా ఉన్న జాతీయ చైతన్యాభివృద్ధి వారిని తమసొంత మార్గాన్ని వెదుక్కునేలా చేస్తోంది. సార్వభౌమాధికారం, స్వాతంత్ర్యం, సమానత్వం, బేజోక్యం సార్వత్రిక గుర్తింపు పొందిన సాంప్రదాయాలై పోయాయి. ఎంచుకునే హక్కును ఉల్లంఘించడమంటే చరిత్ర వస్తుగత గమనాన్ని అడ్డుకోవడమే.

బలప్రయోగ విధానానికి చారిత్రకంగా కాలం చెల్లిపోయింది. ఈ పరిస్థితిలో ఎంచుకునే స్వేచ్ఛ అంతర్జాతీయ సంబంధాల ప్రజాస్వామ్యీకరణలో అంతర్గత భాగమైంది. నవస్వతంత్ర రాజ్యాల ప్రజలు తమ భవితవ్యానికి తామే అధినాథులు కావాలని కోరుకుంటున్నారు

ప్రపంచ పరిణామాన్ని యిప్పుడు అనేక కారకాల పరస్పర ప్రభావం నిర్ణయిస్తుంది. అంతర్జాతీయ రంగంలో జరుగుతున్న క్రమాలన్నిటినీ రెండు పరస్పర వ్యతిరేక వ్యవస్థల పోరాటంగా కుదించిచూడటం, ప్రతి ఘర్షణనూ ప్రాచ్య పాశ్చాత్య ప్రపంచాల మధ్య పోరాట ప్రతిబింబంగా చూడటం తప్పు.

"మనతో లేనివాడు మన వ్యతిరేకి" అన్న చిరకాల అవగాహన ప్రాచ్య, పాశ్చాత్య ప్రపంచాల్లో

దేన్నో ఒకదాని పక్షంవహించేలా చేస్తుంది. యిద కొత్తగా రాజకీయ స్వాతంత్ర్యం పొందిన దేశాల ఎంపిక స్వేచ్ఛను పూర్తిగా పరిమితంచేసింది. యీ పరిస్థితికి ఆసియా, ఆఫ్రికా, లాటిన్ అమెరికాల నవ స్వతంత్రదేశాల నిరసన, చరిత్రలో స్వతంత్ర పాత్ర వహించాలన్న కోరిక—వీటి మూర్తిభావమే అలీనోద్యమం.

మానవాళికి రాజకీయ సహిష్ణుత అన్న ఆదర్శాన్ని అలీనోద్యమం నెలకొల్పింది. అలీనోద్యమ స్థాపక దేశాల్లో ఒకటైన భారత దేశం ప్రపంచ ప్రప్రథమ సోషలిస్టు దేశమైన సోవియట్ యూనియన్‌తో కలిసి ఢిల్లీ ప్రకటనను రూపొందించడం ఆశ్చర్యకరమైన విషయమేమీకాదు. యీ నూతన ఆలోచనా ధోరణి మౌలిక సూత్రాల సారాంశం యీ ప్రకటనలో వుంది. అణ్వస్త్రరహిత ప్రపంచంలోకి అడుగిడదామని మానవాళిని ఆహ్వానిస్తోంది.

భిన్న విశ్వాసాలు కలిగిన వారిపై, భిన్న మతాలను అవలంబించేవారిపై మత దండయాత్ర ప్రయత్నాలు యెంతహానికరమో మధ్యయుగాల్లోనే అనుభూతమైంది. శతాబ్దాల తర్వాత ఎంటాంటే దేశాలు బోల్షివిజంను శైశవదశలోనే కుత్తుక నులమాలని చూచాయి. తర్వాత యూరప్‌లో "నూతన వ్యవస్థ" పేరుతో హిట్లర్ సోవియట్ యూనియన్‌ను అణచివేయ జూచాడు. ప్రపంచాన్ని విభజించిన "ఇనుపతెర"ను గురించి ఫుల్టన్‌లో చర్చిల్ చేసిన ప్రసంగం మరో సోవియట్ వ్యతిరేక మత యుద్ధానికి పిలుపే. ఈ రోజుల్లో సైతం రీగన్ నయాప్రపంచాధిపత్య సిద్ధాంతంలో యీ కజ్జాకోరు తనమే కనిపిస్తుంది. ఆఫ్ఘనిస్తాన్, కంపూచియా, అంగోలా, నికరాగ్వాలో ప్రభుత్వ వ్యతిరేక శక్తులకు సైనిక సహాయం రూపంలో విప్లవ ప్రతీ ఘాతాన్ని యెగుమతి చేసే సిద్ధాంతమిది.

"మనతో లేనివారు మనకు వ్యతిరేకులు" అన్న నినాదం మనల్ని ప్రపంచం అఖండమైనదని గ్రహించకుండా చేస్తుంది. తన జాతీయ ప్రయోజనాలను ఇతర రాజ్యాల ప్రయోజనాలతో సమన్వయపర్చకుండా నివారిస్తుంది; భిన్నసామాజిక వ్యవస్థలను ఒకదానికొకటి దూరంగా ఉంచుతుంది. ప్రతిరాజ్యం తన ఆంతరంగికాభివృద్ధికి అనుకూలమైన బాహ్య పరిస్థితులను సృష్టించుకోవాలన్న ఆసక్తితో ఉండటం సహజం. అయితే, బాహ్య ప్రపంచాన్ని ప్రాభావితం చేయాలంటే దానితో సహకారం నెరపాలిగదా! కాబట్టి, సోషలిస్టు ఆర్థిక వ్యవస్థ, శాస్త్ర, సాంకేతిక రంగాలు పెట్టుబడిదారీ ఆర్థిక, శాస్త్రీయ, సాంకేతిక రంగాల నుంచీ ఎడంగా ఉండరాదు. యెందుకంటే దీనివల్ల యెవరికీ ప్రయోజనం వుండదు. ఎంచుకునే స్వేచ్ఛ అంతర్జాతీయ సంబంధాలలో ఒక ప్రజాస్వామిక అంశమని యిదివరకే చెప్పాను. ఇది ప్రతి రాజ్య విదేశాంగ విధాన ప్రజాతంత్రీకరణకు అవసరం కూడా. ఎంచుకునే స్వేచ్ఛను సమర్థించడమంటే అభివృద్ధికి బహుళ రూపాలున్నాయని గుర్తించడమన్నమాట. కాబట్టి, విదేశాంగ విధాన నిర్ణయాల బహుళరూపతను గుర్తించడమన్న మాట. అనేక రూపాలలో అత్యుత్తమమైన రూపాన్ని ఎంచుకునే అవకాశం ఏర్పడటం వల్ల ఏకపక్ష వైఖరిని, పిడివాదాన్ని, తాను తప్పుచేయజాలనన్న భ్రమనుతొలగించ వీలవుతుంది.

అందువల్ల ఎంచుకునే స్వేచ్ఛ అన్న భావన మనకు కూడా ముఖ్యమైనది. మన ఆంతరంగిక విధానరంగంలో పెరెస్త్రోయికా నిర్దిష్ట ఫలితాలకన్నా బాహాటత ఉరుకులు పరుగులతో ముందుకు సాగిపోతోంది. కానీ, విదేశాంగ విధానంలో పరిస్థితి భిన్నంగా ఉంది. సోవియట్ దౌత్యనీతిని ప్రజాస్వామికం చేసేందుకు ముఖ్య సమస్యలను చర్చించి, నిర్ణయించే చట్టబద్ధ యంత్రాంగం ఉండాలి. సోవియట్ విదేశాంగవిధానాన్ని రూపొందించడంలో ప్రజలు క్రియాశీలంగా పాల్గొనాలి.

"సహనంతో ప్రవర్తించడం, మంచి ఇరుగు పొరుగువారిలా శాంతియుతంగా కలిసి జీవించడం, అంతర్జాతీయ శాంతి, భద్రతల రక్షణ కోసం మన కృషిని కూడదీసుకోవడం" — ఐ.రా.స. ప్రణాళికలోని ఈ మాటలు సర్వత్రాగుర్తింపుపొందిన అన్ని రాజ్యాలకూ అనుసరణీయమైన ప్రవర్తనా నిబంధనావళిని మనకు జ్ఞాపకంచేస్తున్నాయి. కాబట్టి, కొత్త నిబంధనావళి అవసరం లేదు.

ఎంచుకునే స్వేచ్ఛను గుర్తించడం, అంతర్జాతీయ సంబంధాల ప్రజాతంత్రీకరణకు ఒక ముఖ్యావసరం. ప్రపంచాభివృద్ధిలోని వైరుధ్యాల పరిష్కరణపట్ల, ఘర్షణ సన్నివేశాల పరిష్కరణ పట్ల యీ వైఖరి అవలంబించాలి. యిదే మానవాళి మనుగడకూ, యితోధిక సామాజిక ప్రగతికీ హామీ యివ్వగలదు

ఆగస్టు 23 (ప్రావ్దా సంక్షిప్త పాఠం.)

# ప్రజలకు కావాల్సింది ప్రజాస్వామిక మానవతాయుత సోషలిజం



ఫ్యోదోర్ బుర్లాత్స్కీ

ప్రజలకు ఏరకమైన సోషలిజం కావాలి? ఈ ప్రశ్న కమ్యూనిస్టు సూత్రాలనుండీ వైదొలగడంగా కనిపించవచ్చు. కాని,దీన్ని పరిశీలించనారంభిస్తే, ప్రస్తుత సమస్త వాదోపవాదాలూ, చర్చల్లోని ప్రధానాంశం సరిగ్గా యిదే అని తెలుతోంది.

"సోషలిజాన్ని గురించిన మన భావనసంతటినీ మనం పునఃపరిశీలిస్తున్నాం" అని లెనిన్ "సైనిక కమ్యూనిజం కాలం" (1918-1921) తర్వాత అన్నారు. నిర్మొహమోటంగా చెప్పాలంటే, సోవియట్ సమాజం నేడు యిదే సవాలును యెదుర్కొంటోంది. మనం లెనిన్ దృక్పథానికి తిరిగి మళ్లి స్టాలిన్ యుగ దుష్పపర్యవసానాలను ఫలప్రదంగా ఎదుర్కోవాలంటే, యిప్పటికి 70 యేళ్లనుండి సోషలిజాన్ని నిర్మిస్తున్న ప్రజల ప్రయోజనాలూ, ఆశలూ, ఆకాంక్షలు వాస్తవరూపం ధరించాలంటే, మన అభిప్రాయాలను గురించి తిరిగి ఆలోచించాలి. యితర 14 సోషలిస్టు దేశాల అనుభవాన్ని పరిగణనలోకి తీసుకోవడం, సత్వర సాంకేతిక పురోగమన యుగంలో పెట్టుబడిదారీ దేశాలతో మన పోటీని గురించి వాస్తవికంగా అంచనా వేయడం కూడ అవసరం. ఆధునిక సోషలిజాన్ని గురించిన కొత్త దృక్పథ సారాంశం యిదే.

మనదేశంలో సోషలిజం నన్నగిలుతూ రావడానికి కారణమేమి? ఇది యెలా జరిగింది. మొదటి విషయం 1920 లలోనే సోషలిజం గురించి రెండు భిన్న దృక్పథాలుండడమే కదా; రెండు భిన్న నమూనాలు వాస్తవంలో పోటీ పడ్డాయి.

ఒకటి "సైనిక కమ్యూనిజం." యిది క్రూర అంతర్యుద్ధ కాలంలో నెలకొల్పబడింది. యిది కమ్యూనిజంలోకి అమాంతంగా దూకెయ్యడం సాధ్యమన్న అర్ధ అరాచక ధోరణిని ప్రతిబింబిస్తోంది. ఆచరణలో సర్వత్రా జబర్దస్తీ పాలన, హింస, రైతులనుండీ పంటను బలవంతంగా స్వాధీనం చేసుకోవడం, సరకుల సాధారణ మార్పిడిని అంతం చేయడం అని దీనర్థం.

రెండవది నూతన ఆర్థిక విధానం లేక నెప్ (1921-1928). యిది ప్రభుత్వ రంగసంస్థల, సహకార, ప్రైవేటు రంగసంస్థల మధ్య పోటీని అనుమతించింది. దీని ప్రకారం రైతులు తమ పంటను స్వేచ్ఛగా మార్కెట్‌లో అమ్మి తమ కవసరమైన తయారీ సరకులను కొన్నారు. నెప్‌లో ఉన్న ఒక ముఖ్యాంశం ఇదీ: ప్రజాస్వామ్యం ప్రత్యేకించి పార్టీ, ట్రేడ్ యూనియన్లు, సోవియట్లలో

అమలు జరిగింది. సంస్కృతి కళారంగాలలో బహువిధ ధోరణులుండేవి.

విముక్త ఉద్యమం పుట్టినప్పటినుండీ కూడా రెండు విభిన్న ధోరణులు — ఒక వైపు సోషల్ డిమోక్రటిక్ (రష్యాలోని బోల్షివిక్) ధోరణి, మరొక వైపు "సైనిక కమ్యూనిజం" ఉండినాయి. సెయింట్ - సైమన్ ఒక వైపు, బాబ్యూఫ్ మరొక వైపు; మార్క్స్ ఒకవైపు, బకూనిన్ మరొక వైపు నిల్చారు. బకూనిన్ దృక్పథం వ్యక్తి విలువను, సర్వత్రా నాగరిక ప్రవర్తన స్వతంత్ర విలువను తిరస్కరించిన బారకాసుల కమ్యూనిజపు, రోగగ్రస్తమైన కమ్యూనిజపు వికృత ప్రతిబింబం అని మార్క్సయే స్వయంగా వర్ణించారు. అది అట్టడుగు ప్రజల దారిద్ర్యం, అజ్ఞానం, సామాజిక ఈర్ష్యల నుండి పుట్టిందని అన్నారు.

సోవియట్ రష్యాలో బకూనిన్ ధోరణి బలంగా ఉండేది. ప్రజల వెనుకబడిన మనస్తత్వమూ, వారి నియంతృత్వ, పితృస్వామ్య, రాజకీయ సంస్కృతి యిందుకు కారణం. లెనిన్ కాలంలో పార్టీ కేంద్ర కమిటీ పొలిట్ బ్యూరోలో కనీసం సగం మంది వామపక్ష కమ్యూనిజం అనబడే ఈధోరణికి నిబద్ధులైన వారే ట్రాట్స్కీ తన జీవిత పర్యంతం దీన్ని సమర్థించాడు

ఇక, స్టాలిన్ మొదటినుంచీ ఈ వామపక్ష రాజకీయాల ముఖ్య స్రవంతిలోని వాడే. ఆయన టెర్రరిస్టు పద్ధతులను బలపరిచేవాడు. బహుశా ఆయన, నూతన ఆర్థిక విధానాన్ని "సైనిక కమ్యూనిజం" స్థానంలో వచ్చిన ఈవిధానాన్ని ప్రతిపాదించిన లెనిన్ భావాలను అర్థం చేసుకోలేక పోవడానికి లేక ఉద్దేశ పూర్వకంగా నిరాకరించడానికి బహుశా ఇదే కారణం కావచ్చు.

స్టాలిన్ 1920 ల ఆరంభంలో ఈ సిద్ధాంతానికి (లెనినిజానికి) తన సొంత వ్యాఖ్యానం చేయసాగారు.

లెనిన్ ప్రకటనలను స్టాలిన్ క్రమంగా ఎలా వక్రీరించాడో (మొదట రహస్యంగా, తర్వాత అంతకంతకూ ఎక్కువ బాహాటంగా) తెలుసు కోవడం సులభం హింసను కీర్తించడమే స్టాలిన్ సైద్ధాంతిక కృషి ఉద్దేశం

1930 ల ఆరంభంలోనే, స్టాలిన్ చరిత్రలో తన యుగాన్ని పోలిన ఉదాహరణలను వెతకడంలో ఇవాన్ ది టెరిబుల్, పీటర్ దిగ్రేట్ లాంటి భిన్న వ్యక్తులను యెంచుకోవడం యాదృచ్ఛికమేమీ కాదు. దేశ ఔన్నత్యం కోసం అతి పాశవిక పద్ధతులు ఉపయోగించడం అనివార్యమని రుజువు చేయడానికి స్టాలిన్ వీరి అనుభవాన్ని తీసుకున్నారు.

జాతి ఔన్నత్యం, నాయకుని పాత్ర గురించిన తన భావనలను స్టాలిన్ మార్కిస్టు మూలాల నుండీ గాక రష్యాగత అనుభవం నుండీ ఎర్పరచుకొన్నారు.

1939లో జరిగిన 18వ పార్టీ మహాసభలో స్టాలిన్, కమ్యూనిజానికి వెంటనే పరివర్తన చెందడానికి సమయమాసన్నమైందని చెప్పాడు. అయితే, ఆ కమ్యూనిజం ఎలాంటిదనేది, స్పష్టంగా చెప్పలేదు. కాని, ఆచరణలో అది కమ్యూనిస్టు భవితవ్యంలోకి "లంఘన"కు యావత్తు తరాన్ని బలి యివ్వడంగా తేలింది. యీ విధానం ఆర్థిక వ్యవస్థ విచ్ఛిత్తికీ, సహకార వ్యవసాయ క్షేత్రాలను ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలుగా మార్చే ప్రయత్నాలకూ, ఖైదీలతో పనిచేయించడానికీ దారితీసింది.

స్టాలిన్ తన జీవిత చరమదశలో మళ్ళీ తన కమ్యూనిజంలోకి లంఘన పథకాన్ని లంకించుకొన్నాడు. ప్రత్యక్ష వస్తు మార్పిడికి పరివర్తన చెందడం, సరకులకు సేవలకు చెల్లింపుల పద్ధతిని క్రమక్రమంగా విసర్జించడం, సరకు సంబంధాలను, ద్రవ్య సంబంధాలను పరిమితం చేసి తుదకు రద్దు చేయడం — యివన్నీ ఆయన నిర్దేశించిన తక్షణ లక్ష్యాల్లో కొన్ని.

తన భావాల్లోని తప్పును యితరులకంటే బాగా చూడగల మేధావులపట్ల స్టాలిన్ ప్రత్యేకించి అసహనం కనబర్చేవాడు. రచయితలు, సినీ నిర్మాతలు, కళాకారులపై నిందలు మోపడానికి పదేపదే ప్రచారోద్యమాలను ప్రారంభించేవాడు. మానవతా సమస్యలు, సాంస్కృతిక రంగంలో పోటీ వగైరాలు బూర్జువాభావజాల వశేషాలుగా పరిగణించబడ్డాయి.

స్టాలిన్ సృష్టించిన వ్యక్తిపూజ భావజాలం, కమ్యూనిజంలోకి దూకెయ్యడమన్న ఆయన ఊహాస్వర్గజనిత భావం దేశాభివృద్ధికి ప్రతి బంధకాలు అయ్యాయి.

విస్తృత సామాజీకరణ అంటే ప్రభుత్వ నియంత్రణే అనుకొని ఆయన సోషలిజాన్ని నిర్మించే కర్తవ్యాన్ని అతి సరళమైనదిగా చేశారు.

మొదట్లో ప్రభుత్వనియంత్రణలో ఒక్క పరిశ్రమ రంగం మాత్రమే ఉండేది. తుదకు సమిష్టి వ్యవసాయ క్షేత్రాలు కూడా ప్రభుత్వ నియంత్రణ కిందికి వచ్చాయి.

ఈ ప్రభుత్వ నియంత్రణ ఆర్థిక రంగానికి మాత్రమే పరిమితం కాలేదు. అది క్రమంగా యావత్తు దేశ బౌద్ధిక జీవితానికీ, సాంస్కృతిక సంస్థలకూ, ప్రచురణ, నాటక, విద్యా, ఆరోగ్య సంరక్షణ, క్రీడారంగాలకూ విస్తరించింది. ప్రభుత్వ ఉద్యోగులకు ఎన్నికైనవారుగా కాక, యెంచుకో బడిన వారిగా పరిగణించేరు.

ప్రభుత్వ పాలన అధికారవర్గ పెత్తందారీ తత్వానికి కారణమిదీ.

స్టాలిన్ హయాం తరువాత మన సిద్ధాంత, ఆచరణాలు, ప్రభుత్వ సర్వాతీత శక్తిపై నమ్మకాన్ని కమ్యూనిజంలోకి లభించాలనే ఉబలాటాన్ని చాల వరకు అధిగమించాయి. "ప్రస్తుత తరం కమ్యూనిజంలో జీవించగలదు" అన్న ఆశాభావంలో ఉన్న ఆఖరు సోవియట్ నాయకుడు కృశ్చేవ్.

ఒక తరం కాలంలో కమ్యూనిజాన్ని నిర్మిస్తామని వాగ్దానం చేసింది మన మొట్టమొదటి నాయకుడు బ్రెజ్నేవ్. కాని, ఆయనకు సైతం రాజ్యాంగ యంత్రంపైనా, దాని వ్యవస్థీకరణ సామర్థ్యం పైనా గట్టి నమ్మకముండేది. ఆయన అధికారానికి వచ్చిన తరువాత, కృశ్చేవ్ అవాస్తవిక పథకాల పర్యవసానాలను తొలగించి, పాత పద్ధతులకు మళ్ళితే చాలు, అంతా సజావుగా జరిగిపోతుందని నమ్మాడు. "వ్యవస్థాత్మక ప్రతిస్పందన"పై ఆయన ఆధార పడినంతగా మరే నాయకుడు ఆధారపడలేదు. అందువల్లనే, ఆయన కాలంలో మంత్రిత్వశాఖల సంఖ్య నూటికి పైబడింది. ఇది స్టాలిన్ కాలంలో ఉన్న దానికి మూడింతలు ఎక్కువ.

## కొత్త తరహా సోవియట్ సమాజం

ఇది సాంకేతిక శాస్త్రం శీఘ్రగతిలో పురోగమిస్తున్న కాలం. ఇప్పుడు ప్రభుత్వ సోషలిజానికి కాలం

### సి.పి.ఎస్.యు 19వ అఖిలయూనియన్ సమావేశ తీర్మానం నుండి

1. దేశ విప్లవాత్మక పునర్నవీకరణ, పార్టీకార్యకలాపాల, సామాజిక వ్యవహారాల ప్రజాస్వామ్యీకరణ సందర్భంగా మూడేళ్ళ పెరిస్త్రోయికా కాలంలో సంపాదించిన అనుభవం, రాజకీయ వ్యవస్థ మౌలిక సంస్కరణను నేటి తక్షణ కర్తవ్యంగా చేసింది.

సోవియట్ రాజ్యం, శ్రామికవర్గ నియంతృత్వ సాధనంగా ఆవిర్భవించింది. ఆ తర్వాతి సామాజికాభివృద్ధి దశలో అది యావన్మంది ప్రజల రాజ్యంగా అభివృద్ధి చెందింది. అన్ని వ్యవహారాలనూ, ప్రజలు, సర్వాధికారంగల వారి ప్రతినిధులూ నిర్ణయించాలంటే, వాటిని ప్రజల పూర్తి, ఫలప్రదమైన అజమాయిషీ కింద నడపాలంటే సోవియట్ రాజ్యవ్యవస్థను ఈ భావనకు పూర్తి అనుగుణంగా ఉండేట్టు చేయడం ప్రస్తుత కర్తవ్యం.

త్వరలో జరగనున్న రాజకీయ వ్యవస్థ సంస్కరణ ఈ క్రిందికర్తవ్యాలను నెరవేర్చాలని ఈ సమావేశం అభిప్రాయపడుతోంది:

మన సమాజ స్వయం పాలనకు సాధ్యమైనంత విస్తృత అవకాశం యివ్వడమూ, వ్యక్తుల, ప్రాతినిధ్య ప్రభుత్వ సంస్థల, పార్టీ తదితర పౌర సంస్థల, సమిష్టిశ్రామిక బృందాల చొరవను సాధ్యమైనంత యెక్కువ ప్రోత్సహించడానికి అనుకూల పరిస్థితులను సృష్టించడమూను;

— సమస్త వర్గాల, సామాజిక బృందాల ప్రయోజనాలను, అభీష్టాన్ని ప్రజాస్వామ్య పద్ధతుల్లో కనుగొని, రూపుదిద్దడానికిగాను, వాటిని సమరసస్థితికి తీసుక రావడానికిగాను, సోవియట్ ఆంతరంగిక, విదేశాంగ విధాన చట్రంలో వాటిని సాధించడానికిగాను, సజావుగా పనిచేసే యంత్రాంగాన్ని కదలికలో పెట్టడం.

— సోవియట్ యూనియన్‌లోని ప్రతి ఒక్కజాతి, ఉపజాతి మరింత స్వేచ్ఛగా అభివృద్ధి చెందడానికీ, వాటి మధ్య మైత్రినీ, సమానపాయిసహకారాన్నీ అంతర్జాతీయ ప్రాతిపదికపై పటిష్ట మొనరించడానికీ అవసరమైన పరిస్థితులను ఏర్పరచడం;

— అధికారాన్ని అక్రమంగా చేజిక్కించుకోవడానికీ, లేక దాని దుర్వినియోగానికి వీలులేకుండా చేసేందుకూ, బ్యూరాక్రటిక్ వైఖరులను, రూపవాద వైఖరులను ఫలప్రదంగా తిప్పి కొట్టేందుకూ, ప్రజల రాజ్యాంగ హక్కుల, స్వేచ్ఛల రక్షణకు, సమాజం పట్ల, రాజ్యంపట్ల తమకుగల కర్తవ్యాలను

చెల్లింది. అది యెంత మాత్రమూ ఫలితమివ్వదు. అంతర్యుద్ధకాలంలో శృతి మించిన కేంద్రీకరణ, ప్రభుత్వ నిర్బంధం — యివి వనరుల సమీకరణలో, సమస్త కృషిని కూడ దీయడంలో తమ పాత్ర నిర్వహించినమాట నిజమే. కానీ, ఈ పద్ధతి ఇప్పుడు అన్ని రంగాల్లో ప్రగతిని నిరోధిస్తూంది. నేడు ప్రస్తుత పాలనా రూపం మార్చవలసి ఉంది. అది "యావన్మంది ప్రజల స్వయం పాలన సోషలిజం" గా మారాలి అయితే, ఇది క్రమక్రమంగా జరగవలసిన మార్పు.

ఇంత అపార ప్రకృతి వనరులు, యింత శక్తివంతులు విద్యావంతులూ అయిన ప్రజలు గల దేశంలో తగినంత ఆహారపదార్థాలు, బట్టలు, నాణ్యమైన చలన చిత్రాలు, గ్రంథాలు లేక పోవడానికి కారణమేమని అలోచించ వలసిన సమయం వచ్చింది. వైఫల్యానికి కారణం నిజంగా మంచి సోషలిజం లేకపోవడమే ననిపిస్తోంది.

దీన్నిబట్టి, కేంద్రీకృత జాతీయ ప్రభుత్వాన్ని రద్దు చేయాలని అర్థం చేసుకోరాదు. అతి సంక్లిష్టమైన ప్రస్తుత ఆంతరంగిక, అంతర్జాతీయ పరిస్థితుల్లో అలాంటి ప్రతిపాదనకన్న తెలివి మాలినది మరొకటి లేదు. అయితే, చేయవలసినదేమంటే, ప్రభుత్వం తన అధికారాలు, హక్కులను కొన్నింటిని సమాజానికీ, దాని సంస్థలకూ, ముఖ్యంగా ఫ్యాక్టరీ కార్మికులకు, సహకార సంస్థ లకు, ప్రజాసంఘాలు మొదలైన వాటికి దఖలు పర్చడం.

సైద్ధాంతిక, రాజకీయ రంగాల్లో అన్నిటికన్నా **ప్రధానమైనది లెనిన్, మార్క్స్‌లవైపు, సోషలిజం మూలాలకు మళ్ళడం అని మరొక్కసారి నొక్కి చెప్ప దలచాను.** అట్లని వారి వారసత్వానికే మనం మితం కారాదు. తరువాత ప్రపంచ చాలా మారింది. మార్క్స్‌గాని, లెనిన్‌గానీ కోటాను కోట్ల ప్రజలకు శాశ్వతంగా శిరసావహించడానికై సూత్రాలను, నియమాలను తయారు చేయాలని తల పెట్టలేదు.

మరింత ఫలప్రదమైన, ప్రజాస్వామికమైన, మానవతాయుతమైన కొత్త తరహా సోషలిజం యేమిటి? ప్రస్తుతానికి మనకు దాని స్థూల రేఖలు మాత్రమే కనిపిస్తున్నాయి. ఆరేఖలివి: ఖర్చుల మదింపుపైనా, బహువిధ సామాజిక యాజమాన్య రూపాలపైనా ఆధారపడిన ప్రణాళికా బద్ధమైన, సరకుల ఆర్థిక వ్యవస్థ. ప్రభుత్వ యాజమాన్యం యావన్మంది ప్రజల యాజమాన్యంగా రూపొందుతుంది; సహకార, కుటుంబ, వ్యష్టి యాజమాన్య రూపాలు పెంపొందుతాయి. ఆరోగ్యకరమైన ఆర్థిక పోటీ ఉంటుంది. రాజ్య వ్యవస్థ సమాజానికి లోనై ఉంటుంది. పార్టీ, ప్రభుత్వ, పౌరసంస్థల అధికారాలు యిదమిద్ధంగా నిర్ధారణ అయివుంటాయి. స్వయం పాలన అభివృద్ధి చెందుతుంది. ప్రజాభిప్రాయాన్ని రూపు దిద్దడం రాజకీయ క్రమంలో ఒక అంశంగా ఉంటుంది. ఎన్నికల పద్ధతి ప్రాముఖ్యం పెరుగుతుంది. పెత్తనం, పెద్దరికం స్థానంలో సోషలిస్టు సంస్కృతి నెలకొంటుంది.

ఆధునిక సోషలిజం అభివృద్ధి చెందడానికి ఒక దశాబ్దానికి పైగా పడుతుందనేది స్పష్టమే. విద్వేషపూరితమైన కొన్ని అవరోధాలను మినహాయిస్తే మొత్తం ప్రజ తమ దేశశ్రేయస్సు కోసం, ప్రతి పౌరుని శ్రేయస్సు కోసం పాటు పడే కాలంగా యిది వుంటుంది.

(లితరే చర్నాయా గజ్యేత వార పత్రిక నుండి)

పౌరులు నెరవేర్చేందుకు నమ్మకమైన హామీలు వుండేందుకూ వీలుగా సోషలిస్టున్యాయ వ్యవస్థను, చట్టబద్ధతను, క్రమవ్యస్థను మౌలికంగా పటిష్టి మొనరించడం;

— సమాజ రాజకీయ అగ్రగామిగా కమ్యూనిస్టు పార్టీ పాత్రనూ, ప్రజల అధికారాన్ని వ్యవస్థీకరించే, నిర్వహించే సంస్థగా సోవియట్ రాజ్య పాత్రనూ గురించిన లెనినిస్టు భావనకు అనుగుణంగా పార్టీ, ప్రభుత్వ సంస్థల విధులను స్పష్టంగా నిర్దేశించడం;

— ఆంతరంగిక, అంతర్జాతీయ పరిస్థితుల్లోని మార్పులను తగువిధంగా పరిగణనలోకి తీసుకుని, రాజకీయవ్యవస్థ సకాలంలో స్వయంపునర్నవీకరణ చెందడానికీ, దీంతోపాటు సమస్త సామాజిక రంగాల్లో సోషలిస్టు ప్రజాస్వామ్యం, స్వయంపాలన సూత్రాలు రూపొంది, పెంపొందడానికీ హామీ నిచ్చే ఒక ఫలప్రదమైన యంత్రాంగాన్ని నెలకొల్పడం.

రాజకీయ వ్యవస్థ సంస్కరణ సంపూర్ణమూ, సమగ్రమూ, దేశ ఆర్థిక, సామాజిక పునర్వ్యవస్థీకరణతో సమన్వయీకృతమూ అయినదిగా ఉండాలి. ఈ సంస్కరణ సాధ్యమైనంత త్వరగా అమలు జరగాలి

# పెరిస్త్రోయికా యథాతథ వాదులపై విజయం సాధిస్తుంది

దేమిదోవ్

సోవియట్ యూనియన్‌లోని పెరిస్త్రోయికా విధానం కష్టభూయిష్టమైన, నిదానమైన క్రమం. సాంప్రదాయక నిర్మాణ స్వరూపాలూ, ఆచరణరీతులు పెరిస్త్రోయికా అమలుకు ఆటంకం కలిగిస్తున్నాయి. చైతన్య, మనస్తత్వ స్థాయికి "యథా తథ వాదంగా" పేర్కొనబడుతూన్న కొన్ని దృక్పథాల, భావనల ప్రతి ఘటన ఎదురవుతోంది.

రాజకీయ పదజాలంలో యథాతథవాదానికి మరింత సంక్లిష్టమైన అర్థమున్నప్పటికీ, మామూలు మాటల్లో చెప్పాలంటే, యథాతథవాదం అంటే, పాత ఆచరణలను అంటిపెట్టుకుని ఉండటమూ, మార్పును ప్రతిఘటించడమూ, అని అర్థం. యథాతథవాది అంటే, ఏమార్పునైనా ప్రతిఘటించే వాడు కాదని పాశ్చాత్య ప్రపంచంలోని రాజకీయ జీవితం రుజువు పరుస్తోంది. అమెరికాలో రీగన్ యథాతథవాదమూ, బ్రిటన్‌లో మార్గరెట్ థాచర్ యథాతథ వాదమూ సంప్రదాయాలను ఉల్లంఘించే, సుస్థాపిత సామాజిక నిబంధనలను మార్చివేసే తమశక్తినీ, సామర్థ్యాన్నీ స్పష్టంగా నిరూపించుకున్నాయి. యథాతథవాద విధానమూ, భావజాలమూ ఏరకమైన విలువలను పెంపొంది స్తాయనేది అసలు ప్రశ్న.

పాశ్చాత్య యథాతథవాదం రక్షించే, పెంపొందించే అతిముఖ్యమైన విలువ వ్యక్తి సంపూర్ణ స్వాతంత్ర్యం. ప్రతివ్యక్తీ తన సంక్షేమానికి పూర్తిగా తానే బాధ్యుడు అన్న అర్థం దీనిలో అంతర్లీనంగా ఉంది. గృహవసతి హక్కు మొదలుకొని, పనిహక్కు దాకాగల వ్యక్తి ముఖ్యావసరాలకు హామీనివ్వడంలో సమాజ, ప్రభుత్వ పాత్ర ముఖ్యమైనది కాదని దీని భావం.

కాని, సోవియట్ యూనియన్‌లో పెరిస్త్రోయికాకు ఆటంకం కలిగిస్తున్న యథాతథవాద స్వరూపం వేరు, యథాతథవాద ఆలోచనా ధోరణికి ప్రాతిదికగా ఉన్నది, సమాజం తన సభ్యులందరి భవిష్యత్తుకు బాధ్యత వహించాలన్న భావం; పెట్టుబడిదారీ విధానంపై సోషలిజం ఆధిక్యత యిదేనన్న భావం, సోషలిజం వున్న దేశంలో పుట్టినవ్యక్తి తన జీవితాన్ని మెరుగు పర్చుకోవడానికి పాటుపడాల్సిన అవసరంలేదని దీనర్థం.

బ్రిటిష్ పార్లమెంటులో గత వసంతకాలం బడ్జెట్ చర్చలో సోవియట్ "యథాతథవాది" గనుక పాల్గొని ఉండినట్లయితే, స్థానిక పరిపాలనా సంస్థకు ఆర్థికసహాయానికి సంబంధించిన ప్రభుత్వ బిల్లును వ్యతిరేకించే వారిలో చేరేవాడు. ప్రభుత్వం తన పౌరుందరికీ సమాన అవకాశాలు ఇస్తే సరిపోతుందనీ, కానీ, ఆచరణలో ప్రతివ్యక్తికీ దానివల్లయేమి జరుగుతున్నదీ అనే విషయాన్ని పట్టించుకోవలసిన అవసరం లేదనీ చెప్పే

సిద్ధాంతానికి వ్యతిరేకంగా ఓటు చేసేవాడు. (ఆచరణలో జరుగుతున్న దేమిటంటే ఒక కోటీశ్వరుడు మున్సిపల్ బడ్జెట్‌కు పింఛన్‌దారులైన ఇద్దరు వృద్ధులు చెల్లించే మొత్తానికి రెండింతలు మాత్రమే చెల్లిస్తూండటం). రాజ్యబడ్జెట్ ప్రయోజనాల కోసం చేసే చట్టాల సామాజిక పర్యవసనాలపట్ల యింతటి ఘోరమైన నిర్లక్ష్యాన్ని పెరిస్త్రోయికాను గట్టిగా సమర్థించే వారు సైతం సహించి ఉండేవారుకాదు.

పెరిస్త్రోయికా భావజాలాన్ని యథాతథవాద అభిప్రాయాలు యేవిషయంలో వ్యతిరేకిస్తాయి? ప్రధానంగా వ్యక్తికీ, సమాజానికీ మధ్య సంబంధం గురించిన భావనలో. వ్యక్తి తన సొంత వ్యవహారాలకు, మొత్తం సమాజవ్యవహారాలకు బాధ్యత వహిస్తున్నట్టుగా సమాజంకూడా వ్యక్తి విషయంలో బాధ్యత వహించాలన్న దృక్పథం మీదనే సోవియట్ యూనియన్‌లోని ప్రస్తుత సోషలిజం పునర్నవీకరణ ఉద్యమం ఆధారపడి ఉంది. యీ భావజాలం వ్యక్తి పూజనుగానీ, సమాజఆరాధననుగానీ అంగీకరించదు. సందర్భవశాత్తూ ఒక మాట. సమాజానికీ, వ్యక్తికీ మధ్య సంబంధాన్ని గురించి, సమతూకంలేని ఏకపక్ష దృక్పథం విషయంలో పాశ్చాత్య యథాతథ వాదానికీ, సోవియట్ యథాతథ వాదానికీ సామ్యం ఉంది: మొదటిది వ్యక్తికి సర్వాధిక ప్రాధాన్యం యిస్తుంది. రెండవది సమాజం ప్రాధాన్యతను గురించే నొక్కి చెబుతుంది.

మన ఆర్థిక, రాజకీయ, సాంస్కృతిక జీవితంలో నూతన ధోరణులు వ్యక్తమైనప్పుడల్లా సోవియట్ యథాతథవాదం దాన్ని వ్యతిరేకిస్తూంటుంది. సంస్కరణల సమర్థకులతో యథాతథ వాదులకూ పలు అంశాల్లో గల అభిప్రాయభేదాల్లో మూడింటిని కింద యిస్తున్నాను.

మొదటిది గతానికి సంబంధించినది అదేమంటే స్టాలిన్‌ను గురించిన అభిప్రాయం. సోషలిజం సాధించిన ఆర్థిక, సామాజిక ఘన విజయాలనూ, రెండవ ప్రపంచ యుద్ధంలో మనవిజయాన్నీ స్టాలిన్ ఘనతగా చెబుతూ, ఆనియంతపై మన గౌరవం తగ్గరాదనేవారు చాలామంది ఉన్నారు.

రెండవది వర్తమాన కాలంలోనిది, సహకార సంఘాల విషయం. సహకార చట్టం ఆమోదం పొందినప్పటికీ, ఉత్పత్తి, సేవలు, వ్యాపారం ప్రభుత్వ అజమాయిషీలోని రంగం వెలుపల జరగడమంటే యిష్టంలేనివారు చాలామంది ఉన్నట్టు కనిపిస్తోంది.

మూడవది, భవిష్యత్తుకు సంబంధించిన అంశం ధరలు. అన్ని ముఖ్యమైన సరకులూ సామాజిక సదుపాయాలూ సమాజ సభ్యులందరికీ సమానంగా అందుబాటులో ఉండేలా చేయడం సోషలిజం చారిత్రక విజయాల్లో ఒకటి. ప్రస్తుతం తలపెట్టిన ధరల వ్యవస్థ సంస్కరణ ఈ విజయాన్ని పూర్తిగా వమ్ముచేసి, జీవన వ్యయం విపరీతంగా పెరిగిపోయేలా చేస్తుందని అనేకమంది అంటున్నారు. "స్టాలిన్‌కాలంలో ధరలు తగ్గాయి." అన్న దొక్కటే వారివాదన.

స్టాలిన్ అభిమానులకూ, సహకార సంఘాలను తీవ్రంగా తూలనాడేవారికీ, ధరలను మార్చే పథకాలను నిరసించే వారికీ ఒకేరకమైన అభిప్రాయాలున్నాయని తుది విశ్లేషణలో తేలుతోంది.

సోవియట్ సమాజంలోని యథాతథ వాదాన్ని విస్తృతంగా వ్యాపించిఉన్న నిరంకుశాధికార్ల అధికార దుర్వినియోగాలతో తరచు ముడిపెడుతున్నారు. కాబట్టి యథాతథవాద సామాజిక పునాది గురించిన గణాంక లెక్కలు బహుశా తప్పుదోవ పట్టించ వచ్చు. మనదేశంలోని పరిపాలనా యంత్రాంగంలో 18 మిలియన్ల మంది ఉన్నారని అవి తెలుపుతున్నాయి. కానీ వీరిలో పెరిస్త్రోయికాను బలపరిచే సోవియట్ కమ్యూనిస్టుపార్టీ కేంద్ర కమిటీ ప్రధానకార్యదర్శి, అనేక యితర ఉన్నత, మధ్యతరహా, కిందస్థాయిల నాయకులుకూడా ఉన్నారన్న వాస్తవాన్ని అవి ప్రతిబింబించవు. కాబట్టి, ఈ సంఖ్య అతిశయోక్తి అని చెప్పవచ్చు.

అదే సమయంలో, యథాతథవాదులున్నది కేవలం పరిపాలనా యంత్రాంగంలో మాత్రమే కాదన్న విషయం పరిగణనలోకి తీసుకుని చూచినప్పుడు ఈ సంఖ్య తక్కువ అంచనా అవుతోంది కూడా. అసమర్థ అధికారులకూ, ఉత్పత్తి రంగంలోని యితర అసమర్థులకూ ఒకరకమైన బాంధవ్యం ఉందని సోవియట్ ఆర్థికవేత్త, పాత్రికేయుడు గెన్నాది లిసిచ్కిన్ పేర్కొన్నారు. ఏ రంగంలో పనిచేస్తున్నారన్న దానితో నిమిత్తం లేకుండా పనికిమాలిన వారందరికీ యథాతథ వాదమనస్తత్వాన్ని పెంచి పోషించే ఉమ్మడి ప్రయోజనాలున్నాయనేది స్పష్టం.

అయితే, యథాతథ వాదులను ఏకంచేసే విలువలస్థాయి దానికన్నా యెక్కువ విస్తృతమైనది.

ఖచ్చితమైన క్రమశిక్షణ, పాంచావిసర్జన, కష్టపడి పనిచేయడం అన్న సూత్రాలను పాటించడం ద్వారా, ప్రజలు తమకు రాజ్యం కల్పిస్తున్న రక్షణకు, ప్రతిఫలం చెల్లించాలని యథాతథవాదులు చెబుతున్నారు. ఇలాంటి ఆదర్శాలను ఏ సోమరిపోతూ, సామాజికంగా బేఫర్వాగా వ్యవహరించే ఉదాసీనుడూ బలపరచడు. ఈ ఆదర్శాలు తమ ప్రయోజనాలకు ఉపయోగపడుతున్నా యన్న ఒక్క కారణం వల్లనే బ్యూరాక్రాట్లు, అసమర్థులు వాటిని బలపరుస్తున్నారు తప్ప యీ ఆదర్శాలు వారివికావు. అయితే అలాంటప్పుడు యివి ఎవరివి?

"పొల్పెంత కష్టపడి చేసినప్పటికీ వారిపనికంటే నా పని కష్టమైనదీ, యెక్కువ బాధ్యతతో కూడినదీను. కానీ నావేతనం ఆదర్జీ సంపాదన ముందు ఓగలుడుపే. మీరు ఇదంతా న్యాయమేనంటారా?" అని ఒక మాస్కో భూగర్భ రైలు డ్రైవరు ఒక దుస్తుల తయారీ సహకారసంఘ అత్యధిక లాభాలను గురించి ఒక టీ.వీ.కార్యక్రమంలో ఆగ్రహంతో ప్రశ్నించాడు.

ఇది సోవియట్ యథాతథ వాదానికి దారితీసే పథం. పనికీ ప్రతిఫలానికీ మధ్య అగాధం చాలా కాలంగా ఉంటూ వస్తోంది. తమకు తక్కువ ప్రతిఫలం లభిస్తోందనిగానీ, తమకు అధిక ప్రతిఫలం లభిస్తోందనిగానీ గ్రహిస్తున్న లేదా సహజంగా భావిస్తున్నవారు ఈ యథాతథ వాదానికి సామాజిక ప్రాతిపదికగా వున్నారు. వీరి ప్రయోజనాలు పరస్పర విరుద్ధమైనవి. అయినప్పటికీ, మార్పుకోసం జరిగే ఏ ఉద్యమమైనా, ఆత్మరక్షణ కోసం వారు ఒకరినొకరు అంటిపెట్టుకునేలా చేయగలుగుతోంది. పెరిస్త్రోయికా ఒక పనికిమాలిన కార్మికుణ్ణి, ఒక అసమర్థుడైన అధికారిని, ఒక ప్రతిభాహీనునుడైన రచయితను సమానంగా భయపెడుతోంది.

మన ఆర్థికవ్యవస్థ, సమాజాల స్వరూపాన్నే మార్చివేసే యీ సంస్కరణలకు భూగర్భ రైల్వే డ్రైవరు వంటి నిజాయితీపరులైన కార్మికుల నుండి కూడా ప్రతిఘటన ఎందుకు ఎదురవుతోంది? వాళ్ళు దేన్ని చూచి భయపడుతున్నారు? ఈ సంస్కరణలు కార్మికులకు ఇంకా యెక్కువ డబ్బు సంపాదించే అవకాశం కలిగిస్తాయిగదా?

'అయితే, తన సంక్షేమం తన పని తీరుపై ఆధారపడి ఉంటుందని ఊమూలు కార్మికునికి

### సి.పి.ఎస్.యు 19వ అఖిలయూనియన్ సమావేశతీర్మానం నుండి

ప్రజాస్వామ్యాన్ని పెంపొందించడం, సోషలిస్టు స్వయంపాలనా రూపాలను విస్తృతంగా అభివృద్ధి పర్చడం, సోవియట్ల అధికారాలను పెంచి, పటిష్టమొనరించడం, ప్రభుత్వ నిర్ణయాలను చేయడంలో, వాటిని అమలు జరపడంలో శ్రామిక ప్రజలు ప్రత్యక్షంగా పాల్గొనేలా చూడటం, దేశ జీవితంలోని వివిధ రంగాలలో పరిస్థితిని గురించి ప్రజలకు మరింత బాగా తెలియజేయడం, ప్రభుత్వసంస్థల కార్యకలాపాలపై ప్రజల అజమాయిషీని పెంచడం — వీటికోసం అవిశ్రాంత కృషిసల్పడం ద్వారా సామాజిక, రాజకీయరంగాల్లో బ్యూరాక్రసీకి వ్యతిరేకంగా పోరాటం జరపాలి. ప్రజాస్వామ్య కేంద్రీకృత స్థానే బ్యూరాక్రటిక్ కేంద్రకతను ప్రవేశపెట్టే ఏప్రయత్నాన్ని అయినా దృఢంగా తిప్పికొట్టాలి.

మేధా, సాంస్కృతిక, నైతిక రంగంలో బ్యూరాక్రసీకి వ్యతిరేకంగా దాడి సల్పడమంటే సంబంధిత లెనినిస్టు సాంప్రదాయాలనూ, ప్రమాణాలనూ పునరుద్ధరించడం, మార్క్సిజం - లెనినిజం భావజాలాన్ని సృజనాత్మకంగా ఉపయోగించి అభివృద్ధి పర్చడం, నూతన ఆలోచనా ధరణిపై పట్టు సంపాదించి, దాన్ని నిర్దుష్టం చేయడం, పిడివాద వ్యక్తీకరణలకూ, అల్పబుద్ధితో కూడిన నైతిక సూత్రాలకూ, సామాజిక పరాన్నభుక్కుతత్వానికీ, అధికార దుర్వినియోగాలకూ సంబంధించిన ప్రఘుస్త వ్యక్తీకరణలకు వ్యతిరేకంగా అవిశ్రాంత పోరాటం జరపడం అని అర్థం. దృక్పథాలను, అభిప్రాయాలను స్వేచ్ఛగా పోల్చి చూచుకునేందుకు అనుకూల వాతావరణాన్ని సృష్టించాలి; విజ్ఞానశాస్త్రం, సంస్కృతుల కార్య కలాపాల నిర్వహణలో అల్పిష్టి సామంతత్వాన్ని ఆజ్ఞాపించే పనితీరు అవశేషాలనూ అధిగమించాలి.

నచ్చచెప్పటం కష్టం. సోవియట్ ప్రజలలో కొన్ని తరాలు చక్కని పనిని నిరుత్సాహపరచిన వ్యవస్థలో పెరిగాయి. ప్రజాబాహుళ్య మనస్తత్త్వం అనుభవాన్ని మరచిపోయేలా చేస్తుంది. అందువల్ల, ప్రజలు ఎటువంటి మార్పునైనా అనుమానిస్తారు. ఇది ఇలా ఉండగా సహకారసంస్థలు గడిస్తున్న లాభాలు చూచి తక్కిన ప్రజలు ఆగ్రహిస్తారు. వ్యష్టి శ్రమను కఠినంగా అణచివేసిన కాలమే మంచిదని అనుకుంటారు.

"సంస్కరణ సమర్థకులు", "యథాతథవాదులుగా" సోవియట్ సమాజ విభజన, అస్థిరమైనదే కాని స్పష్టంగా కనిపిస్తున్నది. ఇది తమ సొంత గమ్యంపట్ల బాధ్యతను రాజ్యంతో పంచుకొనడానికి యిష్టపడే వాళ్ళుగా, అందుకు యిష్టపడని వాళ్ళుగా ప్రజల విభజన అన్నమాట. ఈ విభజన రేఖ సామాజికబృందాలు, వృత్తి బృందాల మధ్య గల సరిహద్దు రేఖను పోలివుండదు. ఇది జనాభాను నిలువుగా విభజిస్తోంది. అనేక సందర్భాల్లో యిది ప్రజల వ్యక్తిగత ప్రయోజనాలపై ప్రభావం నెరపుతోంది.

కాబట్టి, సమస్య నేడు ఎంతమంది యథాతథ వాదులున్నారన్నది కాదు, రేపెందరు ఉంటారన్నది. రేపెందరు ఉంటారన్న విషయం ఆర్థిక సంస్కరణలక్రమం మీదా, దాని తర్వాత వచ్చే సామాజిక, రాజకీయ మార్పుల మీదా ఆధారపడి ఉంటుంది. "పనిని బట్టి ప్రతిఫలం" సూత్రాన్ని మనం ఏకరీతిగా పాటిస్తేనే యథాతథ వాదాన్ని ఓడించగలం. ఈ లక్ష్యాన్ని సాధించాలంటే మనం యెంతో పాటుపడాల్సి వుంటుంది. పారిశ్రామిక సంస్థలకు స్వాతంత్ర్యం యివ్వడం ద్వారా, గ్రామీణ ప్రాంతంలో జట్టు కాంట్రాక్టు పద్ధతులను పెంపొందించడంద్వారా, సహకారసంఘాలను పెంపొందించడం ద్వారా మాత్రమే మనం యథాతథ వాదులను పెరిస్త్రోయికా సమర్థకులుగా మార్చగలం

ముఖ్యమైన విషయమేమిటంటే పెరిస్త్రోయికా విధానం యథాతథ వాదులను బలప్రయోగంతో సమాజానికి దూరంగా ఉంచే పద్ధతులకు ఆస్కారమివ్వదు. అసలు విషయమేమంటే యథాతథవాద శక్తులతో ఘర్షణ యెంత తీవ్ర మైనదైనా, వారిని సంస్కరణకు అనుకూలంగా తిప్పుకోవడమే తప్ప వారిని నాశనం చేయడం కాదు. వాదనలద్వారా ఒప్పించడంకన్నా మంచి పద్ధతి మరొకటిలేదు.

# యువజనుల హక్కులు

ఇగోర్ ఇల్యీన్‌స్కీ,
డి.ఎస్సీ (తత్త్వశాస్త్రం)

దేశరాజకీయ జీవితంలో యువతరం పాత్ర, దానికి సాంస్కృతిక విలువల అందుబాటు, దాని పాదార్థిక సంక్షేమం — యివన్నీ సమాజంలో దాని స్థానాన్ని తెలియజేసే ప్రధాన గీటురాళ్ళు సంఘంలోని ఒక సామాజిక బృందమైన యువతరానికి గల హోదా సమాజంపట్ల దాని వైఖరిని రూపొందిస్తుందనేది నిజం. దాని ఆచారాలు, భావజాలం, ఇతర బాధ్యతలు, జీవితాదర్శాలు, యువతీయువకుల సామాజిక కార్యకలాపాల పుష్కలతను, వాటిస్థాయికి దానివైఖరి పూర్వాపేక్షితంగా వుంటుంది.

ఏ సమాజంలోని యువతరానికైనా యీ ప్రాథమిక సూత్రాలు వర్తిస్తాయి. కానీ నేను సోవియట్ యువజనుల గురించి చర్చించదలచుకున్నాను. సోవియట్ యువజనులకు సమస్యలు లేనే లేవని చెప్పడంలేదు. వారికి యెన్నో సమస్యలున్నాయి. అయితే సోవియట్ యువజనులకు నిజమైన హక్కులు, 'పనిచేసే, విద్యనుపొందే, విశ్రాంతి వినోదాలను అనుభవించే, సామాజికంగా పురోగమించే అవకాశాలు వున్నాయి — యివన్నీ సోవియట్ యూనియన్‌లోని యువజనులు తమ ఆశలను, మనోభావాలను వాస్తవం చేసుకోడానికి, యువతరం విషయంలో సామాజిక న్యాయ సూత్రాన్ని అమలు పర్చడానికి పునాదిగా వున్నాయి. ఈ పునాది చాల గట్టిది, బలమైనది.

## నానారకాల నిజహక్కులు

రాజ్యాంగంలో ప్రకటించిన పూర్తి సామాజిక, ఆర్థిక, రాజకీయ, వ్యక్తిగత హక్కులను సోవియట్ యూనియన్‌లోని యువజనులు అనుభవిస్తున్నారు. వాటిలో పనిహక్కు, సమస్తపౌరస్వేచ్ఛలు,

సాంస్కృతిక సంపద, విజ్ఞానశాస్త్రం, సంస్కృతి, విద్యలను విస్తృతంగా, స్వేచ్ఛగా పొందే హక్కు వున్నాయి. ఇది వారు సామాజికంగా, రాజకీయంగా అభివృద్ధి చెందడానికి హామీనిస్తాయి.

సోవియట్ యూనియన్ రాజ్యాంగం ప్రకారం యువజనులకు ప్రజాసంఘాలను యేర్పాటు చేసుకునే హక్కువుంది. దీనిప్రకారమే ఒక స్వతంత్ర, సామాజిక-రాజకీయసంస్థ అయిన కమ్సొమోల్‌ను యేర్పాటు చేసుకున్నారు. వారికి యితర యువజన సంస్థలు కూడా వున్నాయి.

యువజనులకు వాక్, పత్రికా, సమావేశ, ప్రదర్శన, వూరేగింపుల స్వాతంత్ర్యాలు వున్నాయి. క్రీడల సదుపాయాలు, క్లబ్బులు, స్టేడియంలు, ముద్రణాలయాలు వారికి అందుబాటులో వున్నాయి.

సోవియట్ యూనియన్ రాజ్యాంగంలోని 10 వ నిబంధన ప్రకారం కమ్సొమోల్‌కు వాటి ఆస్తిపై సోషలిస్టు యాజమాన్యహక్కు యివ్వబడింది. కమ్సొమోల్‌కు తన లక్ష్యాలను సాధించుకోడానికి యిది అవసరం. 7వ నిబంధన ప్రకారం రాజ్య, పౌర వ్యవహారాల నిర్వహణలో, రాజకీయ, ఆర్థిక, సామాజిక, సాంస్కృతిక వ్యవహారాలను నిర్వహించడంలో పాల్గొనే హక్కు కమ్సొమోల్‌కు వుంది. 100 వ నిబంధన ప్రకారం సోవియట్ల యెన్నికలకు అభ్యర్థులను ప్రతిపాదించే హక్కు, అభ్యర్థుల రాజకీయ, వ్యవహార, వ్యక్తిగత గుణగణాలను చర్చించేహక్కు, వారి తరపున సభల్లో, పత్రికల్లో, టెలివిజన్, రేడియోలద్వారా ప్రచారం చేసేహక్కు వుంది. 113 వ నిబంధన ప్రకారం కమ్సొమోల్‌కు తన కేంద్రకమిటీ ద్వారా శాసనాలను ప్రతిపాదించే హక్కువుంది.

పాలకపార్టీ అయిన సోవియట్ కమ్యూనిస్టు పార్టీలో యువజనులకు గణనీయమైన నిష్పత్తిలో సభ్యత్వం వుంది. పార్టీకార్యకలాపాల్లో యిది చురుకుగా పాల్గొంటోంది. వేలాదిమంది కమ్సొమోల్ బాధ్యులు, కార్యకర్తలు సోవియట్ కమ్యూనిస్టు పార్టీ జిల్లా, నగర, మండల ప్రాంతీయ కమిటీలకు, యూనియన్ రిపబ్లిక్కుల కేంద్రకమిటీలకు యెన్నికయ్యారు. ట్రేడ్ యూనియన్లలో మొత్తం 1,800,000 మంది యువతీ యువకులకు ప్రాతినిధ్యముంది. కమ్సొమోల్ సెర్చిలైట్ బృందాల్లో 4 మిలియన్లకుపైగా కమ్సొమోల్ సభ్యులున్నారు. వీరు ప్రజాఅజమాయిషీ సంస్థలకు సహాయపడుతున్నారు.

జాతి, సరవర్ణ, స్త్రీపురుష బేధాలతో, మతం పట్ల వైఖరి, విద్యాస్థాయి, ఆస్తిహోదాలతో నిమిత్తంలేకుండా సోవియట్ యువజనులందరికీ సమానఓటు హక్కువుంది. 18 యేళ్లు గలవారందరూ ప్రజాప్రతినిధుల సోవియట్లకు, 21 యేళ్లుగల వారందరూ సుప్రీం సోవియట్‌కు ఎన్నికకావడానికి అర్హతవుంది. ప్రస్తుతం 778 వేల యువతీయువ

## మిహాయిల్ గోర్బచేవ్

ప్రస్తుత పరిస్థితుల్లో సోవియట్ కమ్యూనిస్టు పార్టీకీ, ప్రభుత్వానికీ యువత పట్లబాగా ఆలోచించి నిర్ణయించిన ఒక సమగ్ర విధానం వుండాలని మన అభిప్రాయం. అదే సమయంలో,దీన్ని అమలుజరిపేందుకు శాసన, ఆర్థిక, రాజకీయ యంత్రాంగాలను సమకూర్చాలి.

తన ఆలోచనా సరళినీ, శక్తినీ వుత్తమోత్తమైన పద్ధతిలో అభివ్యక్తంచేయడానికి, తన సృజనాత్మక స్తోమతను అభివృద్ధి పరుచుకొని, సోషలిజం ప్రయోజనాలకై వినియోగించడానికి యువతకు వీలు కల్పించే పరిస్థితులను, ప్రేరణను సమకూర్చడమే పార్టీకి, ప్రభుత్వసంస్థలకు, సమస్తపౌర సంఘాలకు ప్రత్యేక కార్యరంగమైన యీ విధాన లక్ష్యం.



మనం యువతపట్ల సంపూర్ణమైన రాజకీయ విశ్వాసం వుంచాలి; వారితో ఒక కొత్త పద్ధతిలో సంబంధాలుంచుకోవాలి. అంటే ''తండ్రులు'' తమ ''పిల్లల'' కు ధర్మోపన్యాసాలివ్వడం విడనాడి పరస్పర సంభాషణలకు పూనుకోవాలి. మనం యువజనుల విశ్వాసాన్ని తిరిగి పొందాలనుకుంటే, వారితో మనం సమానుల్లాగా, దాపరికం లేకుండా పట్టుపట్టితో మాట్లాడటం నేర్చుకోవాలి. సత్యమొక్కటే మనకు తోడ్పడుతుందని జ్ఞాపకం వుంచుకోవాలి. సత్యాన్నిబట్టే విశ్వాసమేర్పడుతుంది.

మనఆశయాలను అమలు పర్చడానికి కృషిచేయడంలో నిస్వార్థంగా వుండాలని మనం యువతకు బోధించాలి. అదేసమయంలో ఆనందమయమూ,

కులు స్థానిక సోవియట్లకు యెన్నికయ్యారు. యిది మొత్తం ప్రజాప్రతినిధుల సంఖ్యలో 34 శాతం. కార్యవర్గసంస్థల్లో యువజనులకు విస్తృత ప్రాతినిధ్యముంది.

అక్టోబరు సోషలిస్టు మహావిప్లవం తర్వాత నాల్గవ రోజు నుంచీనే పిన్నవయస్కులకు ఆరు గంటల పని దినాన్ని నిర్ణయించి ఎనిమిదిగంటల పనిదినానికి సమానమైనవేతనం యిచ్చారు. బాలల శ్రమను నిషేధించారు. 16-18 యేళ్ల వారితో శ్రమతోకూడిన, ఆరోగ్యానికి హానికరమైన పనులు చేయించడం నిషిద్ధం.

## యువజనుల సామాజిక హెూదా

ఇప్పుడు సోవియట్ యూనియన్‌లోని మేధావులలో దాదాపు సగంమంది, యువజనులే; పరిశోధనా సిబ్బందిలో 56 శాతం 30 యేళ్లలోపువారే పరిశ్రమలోని యువజనుల్లో 94 శాతం మందికి వున్నత లేదా సెకండరీ విద్యవుంది. గ్రామీణ ప్రాంతాల్లోని యువజనుల పరిస్థితి త్వరితంగా మారుతోంది. గత 30 యేళ్లలో గ్రామీణ జనాభాలోని ప్రతి వెయ్యిమందిలో వున్నత లేదా సెకండరీ విద్యగల యువజనుల సంఖ్య 20 రెట్లు పెరిగింది.

సోవియట్ యూనియన్‌లో 93 మిలియన్ల మందికిపైగా వివిధ రకాల విద్యాసంస్థల్లో చదువుతున్నారు. వీరిలో పాఠశాలలకు హాజరౌతున్న వారిసంఖ్య 45 మిలియన్లు. సార్వత్రిక సెకండరీ విద్యకు పరివర్తన పూర్తి అయింది. దేశంలోని వున్నత విద్యా సంస్థల్లో 5 మిలియన్ల విద్యార్థులున్నారు. యిది మొత్తం యూరప్‌లోని పెట్టుబడీదారీ దేశాల్లోని విద్యార్థుల సంఖ్య కన్నా యెక్కువ.

వృత్తి విద్య నేర్చుకోదలచినవారు ఎనిమిది లేదా పదేళ్లపాఠశాలా విద్యను పూర్తి చేసిన తర్వాత వృత్తి విద్యాపాఠశాలల్లో చేరవచ్చు. అలాంటిపాఠశాలలు 1,100 వృత్తుల్లో శిక్షణయిస్తున్నాయి.

సోవియట్ యువజనులకు 350 వేల లైబ్రరీలు, 570 నాటకశాలలు, (యిందులో 155 పిల్లలవి), 1295 మ్యూజియంలు, 154 వేల ఫిలిం ప్రొజెక్టర్లు వున్నాయి.

సంస్కృతి సాధించిన విజయాలను యువజనులు అనుభవించడమే గాక దానిలో యువజనుల ప్రతిభావంతులు సృష్టించిన వుత్తమోత్తమమైన వాటిని అభివృద్ధి చేస్తున్నారు. శాఖోపశాఖలుగా వున్న ప్రజాబాహుళ్య ప్రసారసాధనాలు కమ్సొమోల్‌కు అందుబాటులో వున్నాయి. పెట్టుబడిదారీ దేశంలోయెక్కడా యీ పరిస్థితిలేదు. కమ్సొమోల్‌కు మూడు ప్రచురణాలయాలు, 247 యువజన, పిల్లల మేగజైన్లు, వార్తాపత్రికలు వున్నాయి. యివి మొత్తం 80 మిలియన్ల ప్రతులకు పైగా వెలువడుతున్నాయి. దాదాపు 300 రేడియో, టెలివిజన్ ఎడిటోరియల్ బోర్డుల పనిలో కమ్సొమోల్ చురుకుగా పాల్గొంటోంది

యువజనుల చొరవవల్ల యువజన అసోసియేషన్ల, క్లబ్బుల, సాంస్కృతిక, వినోద సౌకర్యాలు, విహారయాత్రా శిబిరాల, స్థలాల శాఖోపశాఖలు త్వరితంగా పెరుగుతున్నాయి. స్పుత్నిక్ అనే ఒక ప్రత్యేక కమ్సొమోల్ యాత్రా సంస్థ దేశంలో, విదేశాలలో యువజనుల యాత్రలను నిర్వహిస్తోంది.

ఇది సోవియట్ యూనియన్‌లో యువజనులు అనుభవిస్తున్న హక్కుల పూర్తి జాబితా యేమాత్రం కాదు. వారి హక్కులకు సంబంధించిన 1500 ప్రత్యేక శాసన చట్టాలు కూడా వున్నాయి.

ఇవన్నీ వున్నప్పటికీ యువజనుల సామాజిక సమస్యలకు సంబంధించిన విషయాలు, తమ విషయంలో సామాజిక వుల్లంఘనలు జరుగుతున్నాయని వారిలో వ్యాపిస్తున్న భావాలు కమ్సొ

ఆకర్షణీయమూ, సర్వసమగ్రమూ అయిన జీవితానికి కావలసిన పరిస్థితులను మం సమకూర్చాలి. నేను యిదంతా చెబుతున్నప్పుడు, నా భావం యువతతో సరససల్లాపాలాడాలని కాదు, లేదా అదొక కొత్త రకమైన సంరక్షణ కాదు; లేదా వారు యేది చేసినా మన్నించాలని కాదు. అసలు యువజనులే యిలాంటి వాటిని తిరస్కరిస్తారు.

నా భావం అదికాదు. సోషలిస్టు సమాజ పునర్నవీకరణ కర్తవ్యాల నిర్వహణలో విశ్వాసం, సోదరత్వం, గౌరవభావం, పరస్పర నిష్కర్షత, క్రియాశీల సహకారం అన్న సూత్రాలపై మనసంబంధాలు ఆధారపడి వుండాలి.

**సోవియట్ కమ్యూనిస్టుపార్టీ 19వ అఖిలయూనియన్ సమావేశానికి సమర్పించిన నివేదిక నుండి.**

మోల్ 20వ మహాసభ (1987 ఏప్రిల్)లో ప్రస్తా వనకు వచ్చాయి.

సోవియట్ యూనియన్‌లోని, నూతన ఆర్థిక పరిస్థితి, సమాజం జీవనంలోని, అన్నిరంగాల్లో జరుగుతున్న పునర్వ్యవస్థీకరణ — యివి యువ జనులకు సంబంధించిన మౌలిక శాసనాన్నీ కమ్సొ మోల్ యువజన అసోసియేషన్ల కార్యకలాపాల నూ మరింత మెరుగు పర్చాల్సిన అవసరాన్ని తెలియజేస్తున్నాయి. యువజనుల గురించిన సోవియట్ యూనియన్ శాసనం వుద్దేశం కచ్చి తంగా యిదే. దాని ముసాయిదాను రూపొందిస్తు న్నారు. తద్వారా యువజనుల చట్టబద్ధ హక్కులను తిరిగి సమీ క్షించి, వాటిని మరింత విస్తరింప జేస్తారు.

(మాస్కొవస్కీ కమ్సొమొలెత్స్ పత్రిక నుండి)

## సోవియట్ యువజనులు: కొన్ని వివరాలు

* 15-29 వయో బృందాల్లోని యువజనులు జనాభాలో 25 శాతం వున్నారు. పరిశ్రమలు, నిర్మాణం, వ్యవసాయ పారిశ్రామిక సముదాయాలు రవాణా రంగాల్లోని కార్మికుల్లో మూడింట ఒకవంతు; శక్తి యింజనీరింగ్, సున్నితపరికరాల తయారీ, రేడియో ఎలక్ట్రానిక్స్‌లో 50 శాతం, వాణిజ్యం సేవల రంగాల్లో 40 శాతం యువజనులే.

* దాదాపు 41 మిలియన్ ప్రజలు కమ్సొ మోల్ సభ్యులు, వీరిలో విద్యార్థులు 38, కార్మికులు 35, వుద్యోగులు 17.7, సమిష్టి వ్యవసాయరైతులు 7.4, యితర వృత్తులవారు 1.9 శాతం.

* ప్రతీసంవత్సరం దాదాపు 2.5 మిలి యన్ బాలబాలికలు వృత్తి, సాంకేతిక విద్యలను పూర్తిచేసి పనుల్లో చేరుతున్నారు.

43.8 మిలియన్ల విద్యార్థులు చదువు తున్న సెకండరీ పాఠశాలలు 137,600 వున్నాయి. సోవియట్ వున్నత విద్యాసంస్థల్లో ఐదు మిలియ న్లకు పైగా విద్యార్థులు, ప్రత్యేక సెకండరీ విద్యా సంస్థలో దాదాపు 4.5 మిలియన్ల విద్యార్థులు అధ్యయనం చేస్తున్నారు. వున్నత విద్యాసంస్థల పదార్థిక, సాంకేతిక పునాదిని మెరుగు పర్చే సమస్య ప్రధానంగా ముందుకు వచ్చింది. విద్యా ర్థులకు ప్రయోగశాలల డిమాండ్‌ను 55 శాతం మాత్రమే తీర్చడం జరుగుతోంది.

* తక్షణ శాస్త్ర, సాంకేతిక కర్తవ్యాలను నెరవేర్చడంలో సంకీర్ణమైన సృజనాత్మక యువజన సమిష్టి బృందాలు సమర్థమైన రూపంగా వున్నాయి. యిందులో యువశాస్త్రవేత్తలు, ప్రవీణులు, కార్మికులు, విద్యార్థులు ఐక్యమైవున్నారు. యివి యువజనులు తమ పరిజ్ఞానాన్ని సృజనాత్మక శక్తి స్తోమతలను అత్యుత్తమంగా వినియోగించుకోడానికి తోడ్పడు తున్నాయి. యిలాంటి బృందాలు యీనాడు దేశంలో 15,000లకు పైగా వున్నాయి.

* స్త్రీల సగటు వివాహ వయస్సు 22.9, పురుషులైతే 24.7 సంవత్సరాలు. 92 శాతం పురు షులు, 93 శాతం స్త్రీలు 30 యేళ్లలోగానే పెళ్లి చేసుకుంటున్నారు. 1963 లో 13 శాతం వధువులు 20 యేళ్ల లోపువారు, యిప్పుడు అది 31 శాతానికి పెరిగింది. 25-30 వయోబృందాల్లోని స్త్రీ పురుషుల్లో వివాహం కానివారు 25 శాతం వున్నారు.

* యువజనులకు ఆసక్తికరమైన విషయాలు ఆధునిక సంగీతం, టెలివిజన్, కమ్యూ నికేషన్, హాబీలు. ఐదవ స్థానం అధ్యయనానిది. యువజనుల్లో 63 శాతం సంగీతం రికార్డు చేసు కుంటారు, 89 శాతం వింటారు. 91.6 శాతం మందికి పాప్‌మ్యూజిక్, 7.2 శాతానికి జానపద సంగీతం, 1.2 శాతానికి సాంప్రదాయక సంగీతం అంటే యిష్టం. 73 శాతం యువజనులకు రాక్ డాన్స్‌అంటే యిష్టం; దాదాపు యువజనులందరికీ డాన్సు చేయడమంటే యిష్టం.

* గత 20 సంవత్సరాల్లో శారీరక విద్య, క్రీడలకు వినియోగించిన కాలం 70 శాతం పెరి గింది. యిది వారానికి రెండుగంటలకన్నా యెక్కువ సమయం తీసుకుంటోంది. యేదేమైన ప్పటికీ యీ సమయాన్ని యెక్కువగా తీసుకుంటు న్నది క్రీడాకారులే. పట్టణాల్లోని 10 శాతం మంది మాత్రమే ప్రతిరోజు వుదయం వ్యాయామం చేస్తారు; వారానికి సగటున ఆరుగంటల పాటు టి.వి చూస్తారు. కాగా సంగీతం, ఔత్సాహిక కళలలాంటి వుపయో గకరమైనకార్యకలాపాల్లోవినియోగించే సమయం తగ్గుతోంది. స్నేహితులతో కలిసిమెలసి వినియో గిస్తున్న సమయం కన్నా 2.5 రెట్లు సమయాన్ని టి.వి. కోసం వినియోగిస్తున్నారు.

(పొలిటిచెస్కోయ్ ఒబ్రాజొవానియ్)

# మెడిలాబ్

## భూకక్ష్యలో నెలకొల్పనున్న ప్రయోగశాల

వి. పిష్‌చిక్

ఈనాటి వరకూ అంతరిక్షయానాలు చేసిన వారి సంఖ్య 200 లకు మించింది. ఐదుగురు సోవియట్ అంతరిక్షయాత్రికులు 200 రోజులకు పైగా రోదసిలో వున్నారు. గత సంవత్సరం యూరి రొమనెంకో దాదాపు ఒక సంవత్సరం రోదసిలో గడిపాడు. అంతరిక్షంలో మానవుని వునికి వల్ల తలెత్తే అనేక సమస్యలు పరిష్కారమైనట్టు యిది తెలియజేస్తోంది. మానవుడు ఒకటి రెండు సంవత్సరాలు భూకక్ష్యలో వుండిపనిచేయగలుగుతాడు, కాని శూన్యగురుత్వాకర్షణ పరిస్థితిలో దీర్ఘకాలం పాటు వుంటే శరీరంలో మార్పులు తప్పని సరిగా వస్తాయనీ, యీ మార్పుల ప్రభావాన్ని సమర్థవంతంగా యెదుర్కోవచ్చుననీ ప్రముఖ సోవియట్ శాస్త్రజ్ఞుడు అకడమీషియన్ ఒలెగ్ గజెంకో యిటీవలే అన్నారు. కానీదీనికి సంబంధించి సాధ్యమైనంత గరిష్ట పరిజ్ఞానం, శూన్య గురుత్వాకర్షణ దుష్ప్రభావాలన్నిటిని సాధ్యమైనంత సమర్థంగా నిరోధించే శక్తి మనకు అవసరమని ఆయన విశదీకరించారు.

శాశ్వత భూకక్ష్య సముదాయాల అభివృద్ధి, రోదసిలో దీర్ఘకాలంపాటు నివాసం, యితర గ్రహాలకు ప్రయాణంలాంటి సమస్యలు - యివి అంతరిక్షయానాలకు దీటైన సమగ్రవైద్య వ్యవస్థను నిరంతరం అభివృద్ధిచేయడం అవసరమని తెలియజేస్తున్నాయి. ప్రస్తుతం వైద్యసమాచారాన్ని పోగుచేసుకుంటున్న పరిస్థితినుండి మారి అంతరిక్షంలోని మానవునిలో జరిగే ముఖ్య పరిణామక్రమాలను నియంత్రించడానికి గల అవకాశాలను పరిశీలించడం ముఖ్యమని ప్రవీణుల అభిప్రాయం.

ఇలాంటి సమస్యను పరిష్కరించడానికి ప్రత్యేక అంతరిక్ష ప్రయోగశాల అవసరం. ఇది మీర్ భూకక్ష్య సముదాయంలో భాగంగా పనిచేయ వీలుంది.

మీర్ అంతరిక్షవేదిక యిప్పటికి రెండు సంవత్సరాలకు పైగా రోదసిలో వుంది. దీనిలో ఆరు డాకింగ్ యూనిట్లు వున్నాయి. ఇందులో ఒక్కొక్కటి వివిధరకాల రవాణా నౌకలను, ప్రత్యేక మాడ్యూల్స్‌ను అనుసంధించు కోగలదు. యిలాంటి మాడ్యూల్‌ను 1987 ఏప్రిల్‌లో మీర్ కేంద్రంలోని డాకింగ్ యూనిట్‌తో అనుసంధించారు. ఇది క్వాంట్ అనే ప్రత్యేక ఖగోళ భౌతిక శాస్త్ర ప్రయోగశాల.

మీర్ కేంద్రంతో యితర పరిశోధనా ప్రయోగశాలలను కూడా అనుసంధించవచ్చు. అలాంటి మాడ్యూల్స్‌లో బయోమెడికల్ ప్రయోగశాల ఒకటిగా వుంటుంది. యిది క్వాంట్ మాడ్యూల్స్‌ను పోలి వుంటుంది. యిందులో పరిశోధనా పరికరాల పెద్ద సముదాయం, కంప్యూటర్ హార్డ్‌వేర్ వుంటాయి. ఈకొత్త ప్రయోగశాల తాత్కాలిక పేరు మెడిలాబ్. ప్రత్యేకంగా శిక్షణ పొందిన ఫిజిషియన్లు, జీవశాస్త్రజ్ఞులు యిందులో ప్రయోగాలు చేస్తారు.

మెడిలాబ్‌లో ఎన్నో నిర్దిష్టోపయోగ విభాగాలుంటాయి. భూకక్ష్య సముదాయాల్లో పనిచేసే అంతరిక్ష యాత్రికులకు శారీరక, వైద్య పరీక్షలు చేసేందుకు యిందులోని పరిశోధనా విభాగాన్ని

వుపయోగిస్తారు. యిందులో అనేక పరిశోధనా పరికరాలు, కంప్యూటింగ్ సముదాయం వుంటాయి.

వైద్య, రోగనిరోధక చికిత్సా విభాగంలో అంతరిక్ష యాత్రికులకు కొంత వ్యవధులతో ఆరోగ్య పరీక్షలు చేస్తారు; యితర రోగ నిరోధక చర్యలు తీసుకుంటారు. అవసరమైతే చికిత్స చేస్తారు.

జీవ శాస్త్ర పరమైన పరిశోధన జరపడానికి మరో విభాగముంటుంది. యిందులో జంతువులను వుంచడానికి అరలు వుంటాయి, సెల్యూలర్ బయాలజీని, పాపులేషన్ జెనెటిక్స్‌ను అధ్యయనం చేయడానికి అవసరమైన యేర్పాట్లు వుంటాయి.

అంతరిక్షయానాల్లోని వివిధ దశల్లో మానవ శారీరక వ్యవస్థను అధ్యయనం చేయడం,జంతువులపై ప్రయోగాలు జరపడం — యిదీ మెడీలాబ్ పరిశోధన ప్రధాన లక్ష్యం. శరీరం పరిస్థితికి సర్దుబాటయ్యే క్రమాల స్వభావానికి సంబంధించిన, దాన్ని క్రమబద్ధం చేసే యంత్రాంగాలను అర్థం చేసుకోడానికి సంబంధించిన సమగ్ర భావనను యీ అధ్యయనాలు సమకూర్చుతాయి. వివిధ జంతువులపై జరిపే ప్రయోగాలు సెల్యులర్ బయాలజీకి, పాపులేషన్ జెనెటిక్స్‌కి సంబంధించినవి.

శస్త్ర చికిత్సలకు సంబంధించిన యంత్రాలను, వ్యూహాలను జంతువులపై ప్రయోగాత్మకంగా పరిశీలించి చూడడం, వ్యాధికి గురైనపుడు చికిత్స చేయడం, ఎముక కణజాలాల వృద్ధిని అధ్యయనం చేయడం — యిదీ యీ విజ్ఞానశాస్త్ర కార్యక్రమంలోని ఒక ముఖ్య విభాగం చేసే పని.

మెడీలాబ్ యూనిట్లలో విజ్ఞానశాస్త్ర పరిశోధనలు ఆవృత్తాలలో జరుగుతాయి. యివి పూర్తికాగానే ప్రవీణులను వంతులవారీగా మార్చడం జరుగుతుంది. కొన్ని జంతువులను, జీవపదార్థాలను తదనంతర పరిశీలనకోసం తిరిగి భువికి పంపుతారు. రవాణా నౌకలద్వారా కొత్త జంతువులను, అవసరమైన పరికరాలను మెడీలాబ్‌కు చేరవేస్తారు. శరీర సంబంధమైన సమాచారంలో యెక్కువ భాగాన్ని మెడిలాబ్ కంప్యూటర్ సముదాయంలో వర్గీకరిస్తారు.

కానీ మెడిలాబ్‌కు సంబంధించిన పూర్తి వివరాను యిప్పుడే చెప్పలేము. అంతరిక్షంలో జరిపిన జీవ-వైద్య పరీక్షల వల్ల, నమూనా భౌగోళిక అధ్యయనాలవల్ల గడించిన అనుభవాన్ని యీ కార్యక్రమంలో సోవియట్ శాస్త్రజ్ఞులు వినియోగించదలచారు. ప్రపంచవ్యాప్త సహకార కృషిలో భాగంగా సోవియట్ ప్రవీణులు తమ పరిశోధనలను సాగించనున్నారు. ఈ కృషిలో ఆసక్తిగల దేశాలు తమ శాస్త్ర, సాంకేతిక శక్తి స్తోమతలను కలబోసుకోవడానికి యిది దోహదం చేస్తుంది, దీనివల్ల ఫలితాలను గరిష్ఠంగా పొందవీలుంటుంది. యీ ఫలితాలు యిందులో సహకరించుకునే దేశాల వుమ్మడి సొత్తు అవుతాయి.

---

# విద్యుత్ శ్వాసప్రేరకాలు

శ్వాసక్రియకు అవసరమైన ఉదరవితానపు కదలికను నిర్ణీత వేగంలో, పరిధిలో పెట్టడానికి ఒక ఎలక్ట్రిక్ శ్వాసప్రేరకాన్ని అఖిలయూనియన్ ఎలక్ట్రోమెకానిక్స్ ఇనిస్టిట్యూట్, వైద్య ప్రవీణులు సంయుక్తంగా అభివృద్ధి చేసి, వుత్పత్తిలో పెట్టారు. ప్రత్యేక ఎలక్ట్రోడ్లను నేరుగా ఉదరవితానంపై లేదా దృఢమైన చర్మముపై పెట్టడంద్వారా శ్వాసకు ప్రేరణ కలిగించవచ్చు. పలురకాల శ్వాసక్రియలో పాలకు-గాయపడిన తర్వాత, శస్త్ర చికిత్స తర్వాత అవసరమైనపుడు, లేదా న్యుమోనియా, ఉబ్బసం

లేదా యితర శ్వాసకోశ సంబంధమైన లోపాలకు-చికిత్స చేయడానికి దీన్ని క్లినిక్కుల్లో, పాలిక్లినిక్కుల్లో, యిండ్లలో వాడుకోవచ్చు.

ఇలాంటి రెండురకాల పరికరాలను తయారు చేస్తున్నారు. ఒకటి ఇఎస్‌డి-2పి స్టేషనరీ మోడల్, దీనిబరువు 3.5 కిలోలు. రెండవది ఇ.ఎస్.డి-2ఎస్-ఎస్‌సి పోర్టబుల్ మోడల్. దీన్ని రోగి శరీరానికి ప్రత్యేక బెల్టులతో కట్టవచ్చు. దీని బరువు 300 గ్రాములకన్నామించదు. శస్త్రచికిత్స చేసేటప్పుడైతే యీ ప్రేరణను ప్రత్యేక ఎలక్ట్రోడ్ తీగెలద్వారా కల్గిస్తారు. యీ తీగెలను మెడ, లేదా ఉదరకుహరమండంలోని ఫ్రైనిక్ నాడికి తగిలిస్తారు. కొన్ని సందర్భాల్లో ఉదరవితానంలోకే ప్రత్యేకమైన సూది ద్వారా యీ తీగెలను ఎక్కిస్తారు. శస్త్రచికిత్స తర్వాత శ్వాసక్రియ సర్దుకునే వరకూ యీ తీగెను శరీరంలో 8-10 రోజులు వుంచుతారు. అర్వాత శస్త్ర చికిత్స అవసరంలేకుండానే యీ తీగెను లాగివేయవచ్చు.

ఈ ఎలక్ట్రిక్ శ్వాస ప్రేరకాలను మాస్కో పిరొగవ్ మెడికల్ ఇన్‌స్టిట్యూట్‌లో పరీక్షించారు. ఎలక్ట్రిక్ ప్రేరకంవల్ల ఊపిరితిత్తుల పరిస్థితి మెరుగుపడు తుందనీ, ఆమ్ల-క్షార సమతూకం సాధారణస్థాయికి చేరుకుంటుందనీ, రోగిలో యితర శ్వాసక్రియ లోపాలు తొలగి పోతాయని రుజువైంది.

శ్వాసకోశసంబంధమైన మొండివ్యాధులతో బాధపడుతున్న రోగులకు మందులు చాలావరకు తీసుకునే అవసరం లేకుండా యీ ఎలక్ట్రిక్ శ్వాసప్రేరకాలు చేస్తాయని యీ ఇన్‌స్టిట్యూట్‌లో తత్సంబంధిత క్లినిక్ అధిపతి అయిన ప్రొఫెసర్ ఎ. చుచాలిన్ అన్నారు. యీయన వైద్యశాస్త్రాల అకాడమీ సభ్యుడు కూడా. యీ ఎలక్ట్రిక్ శ్వాస ప్రేరకాల సామర్థ్యాన్ని యీ క్లినిక్కును సందర్శించిన శ్వాసకోశవిషయాల అమెరికన్ ప్రవీణులు ప్రశంసించారు. యీ రెండు రకాల పరికరాలను త్సెవ్‌రపాల్ లోని ఎలక్ట్రోవా అటోమెటికా కర్మాగారం తయారు చేస్తోంది.

## మిహయీల్ గోర్బచేవ్

మౌలిక, అనువర్తిత శాస్త్రస్తోమత పెంపొందడానికి కొన్నియేండ్లు, దశాబ్దాలు పడుతుందనే మాట నిజమే. కాని, శాస్త్రాభివృద్ధిని త్వరితపర్చే అంశాలు కూడా వున్నాయి: ముఖ్యంగా శాస్త్రరంగంలో పరిస్థితుల ప్రజాతంత్రీకరణ, నిరంకుశాధికారతత్వాన్ని, పెత్తందారీ తత్వాన్నీ యథాతథవాదాన్ని గుత్తాధిపత్యాన్ని అధిగమించడం. ప్రతిభ, సృజనశీలత, స్వయంపాలన, సమానస్థాయీ పోటీ, వివిధ శాస్త్రీయ భావాల, అభిప్రాయాల మధ్య ఆరోగ్యకరమైన పోటీ—వీటిని గరిష్టస్థాయిలో పెంపొందించడానికి సంపూర్ణ అవకాశం యివ్వాలి. పరిశోధనను వ్యవస్థీకరించే పనిని బహుముఖంచేయడం, యిక్కడ కూడా ప్రభుత్వ రూపాలను, సహకార రూపాలను సముచితంగా మేళవించడం వుపయోగకరంగా వుంటుందనే విషయాన్నికూడా కొంతమంది శాస్త్రజ్ఞులు లేవనెత్తారు.

సోవియట్ కమ్యూనిస్టుపార్టీ 19 వ అఖిల
యూనియన్ సమావేశానికి సమర్పించిన నివేదిక నుండి

# బెర్ముడా త్రిభుజము: ఈ శతాబ్ది రహస్యం

ప్రొఫెసర్ స్తైపనోవ్,

*సాగరశాస్త్ర అధ్యయన సంస్థ, సోవియట్ యూనియన్ విజ్ఞాన శాస్త్రాల అకాడమీ*

ఈ ప్రగతి యుగంలోకూడా విజ్ఞానశాస్త్ర ప్రస్తుత అభివృద్ధిదశలో సమాధానం తెలీని అనేక సమస్యలను గురించి పత్రికల్లో చదువుతున్నాము. "గుర్తు తెలియని ఎగిరే వస్తువులు" (యు.ఎఫ్.ఒలు), అట్లాంటిస్ ద్వీప అస్తిత్వంపై వివాదాలు, కొందరి ఇంద్రియాతీత శక్తులు లాంటివి వీటిలో కొన్ని.

బెర్ముడా త్రిభుజం అనేది ఈశతాబ్ది అతి గొప్ప రహస్యాల్లో ఒకటి. ఇక్కడ యితర ప్రమాదకర ప్రాంతాలన్నిటికంటే ఎక్కువ నౌకలు ధ్వంసమై పోయాయి. ఈ బెర్ముడా త్రిభుజంపై వచ్చిన అనేక పుస్తకాల్లో "బెర్ముడా త్రిభుజము: కల్పన, వాస్తవము" ఒకటి. దీనిలో బెర్ముడా ప్రమాదాల సమగ్ర జాబితాను రచయిత లారెన్స్ డి.కాచర్ ఇచ్చారు. 1840-1973కాలంలో 40కి పైగా, నౌకలు, 20కి పైగా విమానాలు అక్కడ ధ్వంసమయ్యాయి. ఈ ప్రమాదాల్లో మొత్తం దాదాపు 1,000 మంది మరణించినట్టు అంచనా.



ఈ ప్రాంతాన్ని గురించిన సమాచారం మనకు 1492 లో అట్లాంటిక్ మహాసముద్రాన్ని దాటిన కొలంబస్ నుండీ అందింది. పెద్దమంట మహా సముద్రంలోకి పడిపోవడం, రాత్రిపూట దూరంనుంచీ అసహజమైన కాంతి పుంజం, దిక్సూచి తప్పు సూచనలు చేయడం ఆయన నావికులకు కనిపించింది. యిక్కడ ప్రమాదాలు జరుగుతున్న వార్తలు ఈనాటికీ వస్తున్నాయి. మంచి అనుకూల వాతావరణంలోనే, ముందుగా ఎలాంటి దెబ్బ తినకుండానే, అకస్మాత్తుగా రేడియో సంబంధాలను కోల్పోయి నౌకలు, విమానాలు ఇక్కడ మాయమైపోతున్నాయి. ఈప్రాంతంలో దిక్సూచి ముల్లు గిరగిర తిరగ నారంభించడం, రేడియో సిగ్నల్స్ వక్రీకరణకు గురి కావడం, అకస్మాత్తుగా సంబంధాలు తెగిపోవడం, విండ్ షీల్డుపై కాంతి రేఖలు కనిపించడం మొదలైనవి గోచరించాయని పైలట్లు తెలిపారు.

కొన్ని సందర్భాల్లో, పతనమౌతున్న నౌకలు, విమానాల నుండీ తెలుసుకోవడానికి వీలులేని సందేశాలు వచ్చాయి. ఉదాహరణకు, 1925 లో రాన్‌ఫికో మారూ నౌకనుంచి ఈసందేశం వచ్చింది. "సహాయం చేయండి. వెంటనే! ఇది బాకు పోటులా ఉంది! అంతా ముగిసిపోయింది!"

1945లో, పహరా తిరుగుతున్న 5 అమెరికా వైమానిక దళ విమానాల పైలట్లు తాము దారితప్పినట్లు, ఎక్కడికి పోతున్నదీ తెలియనట్లు అకస్మాత్తుగా సందేశం పంపారు. వెంటనే ఆ విమానాలతో సంబంధాలు తెగిపోయాయి. ఆ విమానాల్లోగల 27 మంది వ్యక్తుల గతి ఏమైందీ యింతవరకూ తెలియదు. వీరిని కాపాడడానికి వచ్చిన విమానం జాడకూడా తెలియకుండా పోయింది.

బెర్ముడా త్రిభుజంలో జరుగుతున్న మహోపద్రవాలకు కారణాలను వివరించడానికి చాలా ప్రయత్నాలు జరిగాయి. ఇవి మంచి వాతావరణంలో, ఎటువంటి అసాధారణ భూభౌతిక పరిణామాలు లేని సమయంలో జరుగుతున్నందువల్ల, ఈమహోపద్రవాలకు కారణాలను వివరించడం అసాధ్యమన్న నిర్ధారణకు, దాదాపు అందరూ వచ్చారు. బెర్ముడా త్రిభుజం చుట్టూతా ఏదో ఒక విధంగా కాల, స్థల గతి క్రమంలోని వైపరీత్యాలు సంభవిస్తుండటం ఈ విపత్తులకు కారణమన్న ఒక అభిప్రాయముంది. ఈసిద్ధాంతం ప్రకారం, మన భావనకు భిన్నంగా కాలం వేరు వేరు వేగాలతో సాగిపోగలదు. గుర్త్వాకర్షణ లేదా స్థల పరిస్థితులతో ముడిపడి ఉన్న ఏవో కొన్ని కారణాల వల్ల ఒకానొక ప్రాంతంలో కాల గమన వేగం మారినట్లయితే, నౌకలూ, విమానాలు తాము సహజంగా ఉండవలసిన స్థలానికి కొన్ని వందల మైళ్ళ దూరంలో ఉండిపోవచ్చు. ఒక పెద్ద వైపరీత్యం ఫలితంగా "కాలప్రవాహం"లో ఒక భాగం మామూలు స్థితినుంచీ "వైదొలగి పోయి" తన మార్గంలో ఎదురయ్యే దేనినైనా సరే లాక్కుని పోవచ్చు. కాల, లేదా స్థల వక్రగతివల్ల మనమెరిగిన ప్రస్తుత కాల, స్థల వ్యవస్థలో ఆ నౌకల, విమానాల ఉనికి ఆగిపోవచ్చు. వీటిలోని ప్రయాణీకులు భవిష్యత్తులోకి, లేదా గతంలో





కి, లేదా ఒక సమానాంతర విశ్వంలోకి తరలి పోవచ్చు. ఇదంతా నమ్మరానిదిగా, అసాధ్యమైనదిగా తోస్తుంది. కానీ, మనం నివసిస్తున్న పరిమిత స్థలం నుంచీ అనంతమైన విశ్వం, ఆవిర్భావం గురించిన ఊహకూడా అంతటి నమ్మశక్యం కానిదే గదా!

తన ప్రయాణీకులతోపాటు నౌకలూ, విమానాలు జాడ లేకుండా అదృశ్యమైనందుకు కారణం యిదే నని ఒక క్షణంపాటు ఊహించుకుందాం. అయితే సురక్షితంగా వున్న నౌకలలోని, ప్రయాణీకులు, సిబ్బంది పత్తా లేకుండా అదృశ్యం కావడానికి కారణమేమని చెప్పగలం?

ఈ త్రిభుజ ప్రాంతంలో అనేక నౌకలు కనిపించాయి. 1840 నుండీ 1955 కాలంలో మంచిస్థితిలో ఉన్నప్పటికీ ఒక్క మనిషికూడా లేని ఒకటిన్నర డజన్ నౌకలు అక్కడ కనిపించాయి. 1840 లో ఒక ఫ్రెంచి నౌక సరకులతో సాఫీగా సాగిపోతూ బామాస్‌వద్ద కనిపించింది. 1969 లో ఫ్లోరిడా సమీపంలో సిబ్బంది కూడాలేని చెక్కు చెదరని ఐదు నౌకలు కనిపించాయి డైమండ్ షోల్‌లో 1921 జనవరిలో కారోల్ ఎ.డీరింగ్ అనే ఒక నౌక చెక్కుచెదరని స్థితిలో కనిపించింది. ఆనౌకలో అప్పుడే వండిన వంటకాలు కూడా కనిపించాయి. అందులో రెండు పిల్లులు తప్ప మరో ప్రాణి జాడేలేదు. 1944 అక్టోబర్‌లో, మంచి స్థితిలో ఉన్న రౌబికన్ అనే నౌకలో ఒక కుక్క మాత్రం వుంది. ఈనౌకలన్నిటినీ జనం యెందుకు వదిలి పెట్టారు? వాళ్ళను ఎవరైనా ఎత్తుకు పోయారా? విద్యుదయస్కాంత తుఫానులు, లేదా ఓజోన్ పొరలోని ఒక రంధ్రం గుండా కాస్మిక్ రేడియేషన్ వంటి శక్తుల ప్రభావానికి ఆ నౌకలు లోనయ్యాయని అనుకొంటే వాటిలోని మనుషుల జాడలు కనిపించాలి కదా? జంతువులు వీటి ప్రభావానికి ఎందుకు లోనుకాలేదు? ఈ పరిణామాలకు, "గుర్తు తెలియని ఎగిరే వస్తువులకు" ఏమైనా సంబంధం ఉందా?

దీనికి నేను సమాధానం ఇవ్వటం లేదు కానీ, కనీసం ఒక వ్యక్తిగత ప్రతిపాదన చేయదలచాను. విజ్ఞానశాస్త్రంలో చాలా అసంగతంగా కనిపించే మొట్టమొదటి ఊహ ఉత్తరోత్తరా సరియైన కార్యకారణ నిర్ధారణకు దారి తీయడం తరచుజరుగు ఉంది. మన గ్రహమండలానికి భూమే కేంద్రం అనే ప్రతిపాదన తుదకు సూర్యుడు దీనికి కేంద్రమన్న నిర్ధారణకు దారి తీసిందికదా! మన విశ్వం అనంతమైనది కాబట్టి ఇతర గ్రహాలపై తెలివి తేటలుగల జీవులూ, నాగరికతలూ లేవనుకోవడం అసంగతం. అంతేకాదు. అవి మన కన్నా వృద్ధి చెందిన నాగరికతలు అయి ఉండవచ్చు కూడా. మన భూమండలంపై కూడా ఒకప్పుడు ఎంతో అభివృద్ధి చెందిన నాగరికత వున్నదని సూచించే రుజువులు తగినన్ని ఉన్నాయి.

పెరూలోని లాస్కా ఎడారిలోని అతి విశిష్టమైన "నిర్మాణాలు" గత కాలపు రుజువులలోకెల్లా గమనార్హమైనవి. ఇవి రోదసీ నౌకాశ్రయాలని వీటిని బహూశా గ్రహాంతర రోదసీ నౌకలు ఉపయోగించేవని అనేకుల అభిప్రాయం.

బెర్ముడా త్రిభుజంలో అటువంటి రోదసీ నౌకాశ్రయం ఉందని కొందరి అభిప్రాయం.

రోదసి నుంచి వచ్చిన కొన్ని జీవులు అ ప్రాంతంలో ఒక బలమైన శక్తి వనరును స్థాపించి ఉండవచ్చునని వీరు అభిప్రాయపడుతున్నారు. అది సముద్ర గర్భతలం నుంచీ సంకేతాలను, లేజర్‌లాగా ప్రసారం చేసే ఒక సాధనమై ఉండవచ్చు. ఇతర గ్రహాలకు చెందిన రోదసీ నౌకలు భూమి ఎటువైపు వుందో తెలుసుకొని, దానివైపు రావటానికి ఈసంకేతాలను వినియోగిస్తూండ వచ్చు. రోదసినుంచీ వచ్చే ఆదేశాల ననుసరించి ఈసాధనం పనిచేస్తుందా, లేక నిర్దిష్ట వ్యవధులలో సంకేతాలను ప్రసారం చేస్తుందా అనే సంగతి మనకు తెలియదు. అయితే, ఈసంకేత ప్రసారక యంత్రాన్ని రోదసి నుంచీ వస్తున్న ఆదేశాలు నడుపుతూ ఉండవచ్చనే నాకు తోస్తూంది. బెర్ముడా గుండా వెళ్ళే నౌకలూ, విమానాలు ఈ ఆదేశాల ప్రభావానికి లోనవుతూ ఉండవచ్చు. 1977-1978లో సాగర శాస్త్ర అధ్యయనాలు జరిగిన పాలీమోడ్ అనే సోవియట్-అమెరికన్ సాగర పరీక్షా క్షేత్రం ఈసిద్ధాంతాన్ని పరోక్షంగా నిరూపిస్తోంది. ఇది బెర్ముడాకు సరిగ్గా దక్షిణాన ఉంది.

కాబట్టి, ఇతర గ్రహాలకు చెందిన జీవులు ఇక్కడికి వచ్చి పోతూండటం బెర్ముడా త్రిభుజంలోని అంతు తెలియని పరిణామాలకు కారణమని వూహించవచ్చు. ఈనిర్ధారణ ఎంతో ఆశ్చర్యకరమైనదిగా పాఠకులకు తోస్తుంది. కానీ, ఇప్పటి వరకూ లభ్యమైన సాక్ష్యాధారాలూ, తదితర వివరాలను అధ్యయనం చేసి, విశ్లేషించగా తేలిన ఫలితమిది.

# ప్రపంచ పేటెంట్ పోటీలో సోవియట్ యూనియన్

అలెక్సీ పుతిన్‌త్సేవ్

వాషింగ్టన్‌లోని సబ్‌వే రెయిల్స్‌ను సోవియట్ యూనియన్‌కు చెందిన అపూర్వమైన ఆటోమేటిక్ యంత్రాలతో వెల్డ్‌చేశారంటే చాలమంది పాఠకులు విస్తుపోతారనుకుంటా. కాగా సోవియట్ భౌతిక శాస్త్రవేత్త స్వాతోస్లావ్ ఫెదొరోవ్ ప్రతిపాదించిన పద్ధతిని వినియోగించుకోడానికి మెడికల్ టెక్నాలజీ డెవలప్‌మెంట్‌ఫర్మ్ లైసెన్స్‌ను కొన్నందువల్లనే అమెరికాలోని వేలాదిమంది హ్రస్వదృష్టికి చికిత్స లభించింది. ప్రొఫెసర్ ఫెదొరోవ్ సృష్టించిన కృత్రిమ కటకాలు ఎఫ్.జి.ఆర్., బ్రిటన్, ఇటలీలలో పేటెంట్‌ను పొందాయి.

నిప్పన్ స్టీల్, కోబ్‌స్టీల్, యితర జపాన్ కంపెనీలు ఉక్కుతయారికి సంబంధించిన సోవియట్ సాంకేతిజ్ఞతలను కొనుగోలు చేసినందుననే జపాన్ వుక్కు పరిశ్రమ ప్రతికూల వ్యాపార పరిస్థితుల్లో తట్టుకొని నిలచిందని పాశ్చాత్య నిపుణుల అభిప్రాయం. సోవియట్ చమురు సిబ్బంది జలగర్భంలో నిర్వహించిన వెల్డింగ్ ప్రక్రియ అనుభవం సముద్రం నుండి తీరానికి పైపులు వేయడానికి బ్రిటిష్, నార్వేలకు తోడ్పడింది.

ప్రపంచ పరిశ్రమలో ప్రఖ్యాతి చెందిన మన్నెస్మాన్ (ఎఫ్.జి.ఆర్), కెసైర్ అలుమినమ్, అల్కోవా (అమెరికా), మిత్సుబిషి(జపాన్), ఆసేయా (స్వీడెన్) లాంటి కంపెనీలు సోవియట్ పేటెంట్‌లను, సాంకేతిక పరిజ్ఞానాన్ని కొనుగోలు చేశాయి. సాలీనా విదేశీ భాగస్వాములలో 100కు పైగా లైసెన్స్ ఎగుమతి ఒప్పందాలను సోవియట్ యూనియన్ కుదుర్చుకుంటుంది. యీ ఒప్పందాలు పది సంవత్సరాలుగా జరుగుతున్నాయి

నూతన కల్పనల్లో సోవియట్ యూనియన్ అమెరికాలు ముఖాముఖిగా పోటీపడుతున్నాయని వరల్డ్ ఇంటలెక్చువల్ ప్రాపర్టీ ఆర్గనైజేషన్ సమాచారం. యీ దేశాలు ఒక్కొక్కటి సాలీనా సుమారు 80,000 నూతన కల్పనలను రిజిష్టరు చేయించుకుంటున్నాయి. ఇవి జపాన్ నూతన కల్పనలకన్నా (యివి సుమారు 50,000) చాలా యెక్కువ ఇక వెయ్యి చొప్పున రిజిష్టరు చేయించుకుంటున్న ఫ్రాన్స్ బ్రిటన్‌లు పోటీపడే విషయం చెప్పనక్కరలేదు.

సోవియట్ యూనియన్‌కు విజ్ఞానశాస్త్ర భావనలు, వాటి అభివృద్ధుల కొదవలేదని యెదిరుజావు చేస్తోంది. అయితే వాటన్నిటినీ వినియోగించుకోవడం లేదనేది వేరే విషయం. జపాన్ లాగా యీ అవకాశాలను సోవియట్ పరిశ్రమాది సంస్థలు త్వరితంగా వినియోగించుకుని ప్రపంచమార్కెటులో పైచెయ్యి సంపాదించుకోవడంలేదు. దేశంలోని నూతన కల్పనల్లో మూడవ వంతును మాత్రమే 'యివి వినియోగించుకుంటున్నాయని శాస్త్ర, సాంకేతిక విషయాల సోవియట్ ప్రభుత్వకమిటీ తెలియజేస్తున్నది.

ఏదేశంకూడా ఒకేసారి నూతన కల్పనను మొత్తంగా వినియోగించుకోలేదని వేరే చెప్పనవసరంలేదు. యిందుకు కారణం మానవుని జడత్వమేకాదు, ఆర్థిక ప్రోత్సాహకాలు లేకపోవడం కూడా ఒకకారణమే.

సాంకేతిజ్ఞతలు దీర్ఘకాలంలో అపూర్వ అవకాశలనూ ఆవిష్కరిస్తాయి. అవితక్షణ ఫలితాల నివ్వవు. వాటి అమలుకు కాలమూ, పెద్ద మొత్తాల్లో డబ్బూ అవసరం.

"ఎంతో ఆకర్షవంతమైన ఒకకొత్త ఆలోచనను వుత్పత్తిలో వినియోగించినపుడు అది మొదట తక్కువ ప్రయోజనకారిగా వుంటుంది. అందువల్లనే సమూల మార్పులను సూచించే నూతన కల్పనలను కాక కొద్దిపాటి లాభాలను తక్షణమే సమకూర్చే నూతన కల్పలనే పరిశ్రమాది సంస్థలు వినియోగించుకుంటాయి" అని ప్రముఖ సోవియట్ ఆర్థిక వేత్త అకడమీషియన్ అబెల్ అగన్‌బెగ్యాన్ అన్నారు.

ప్రగతిశీలమైనదంతా ఎట్టకేలకు అందరి ఆమోదాన్ని పొందగలదు. కాని ఆలస్యం ఎన్నో నష్టాలకు దారితీస్తుంది. సోవియట్‌యూనియన్ లాంటి పెద్ద ఆర్థిక వ్యవస్థ (ప్రపంచ పారిశ్రామిక వుత్పత్తుల్లో దీనివాటా ఐదవ వంతు) లో యీ నష్టాలు కొట్ట వచ్చినట్లు కనిపిస్తాయి. అందువల్లనే దేశ విజ్ఞాన శాస్త్రశక్తిస్తోమతల సామర్థ్యాన్ని పెంచడానికీ, విజ్ఞానశాస్త్రాన్ని వుత్పత్తిలో మరింత సన్నిహితంగావించడానికీ సోవియట్ యూనియన్ యెంతో శ్రద్ధ కనబరుస్తోంది.

# ఇమ్యూనాలజీ

ప్రొఫెసర్ వాలెంతిన్ గోవల్లో కేన్సర్ రోగ నిదాన పద్ధతి ప్రపంచవ్యాప్తంగా నిపుణవైద్యుల్లో తీవ్ర వాదోపవాదాలను రేకెత్తించింది. ఈయన మాస్కో లోని గాయాల, కీళ్ళ జబ్బుల చికిత్సా శాస్త్రాల కేంద్ర పరిశోధనా సంస్థ డిప్యూటీ డైరెక్టర్. తన శాస్త్ర పరిశోధనను గురించి, కణితులపై చర్చ గురించి ఆయన యిలా చెబుతున్నారు.

రోగనిదాన, చికిత్సా పద్ధతులను గురించి చర్చలు సదా జరుగుతూనే వచ్చాయి. అవిభవిష్యత్తులో కూడా జరుగుతాయి.

ఉదాహరణకు కణితి చికిత్స శాస్త్రాన్నే తీసుకోండి. కణితులకు పరిష్కారమేమిటి? వాటిని మొదట్లోనే కనుగొనడమో లేక వాటి చికిత్స పట్ల పూర్తిగా కొత్తవైఖరి అవలంబించడమో. అయితే యింతవరకూ యీరంగంలో ప్రగతిని మందగింపజేసిందేమిటి? కేన్సర్ కణితి శరీరమంతా ప్రభావం నెరపకుండా, కేవలం కాలేయం, కడుపు, లేక మరో యితర అంగాలను దెబ్బతీసే జబ్బు అని అనేకమంది శాస్త్రజ్ఞుల అభిప్రాయం రోగనిదానం, చికిత్సలపట్ల వైఖరిని యిది ముందే నిర్ణయిస్తోంది. ఈ కణితులను తీసివేయడం, రేడియో ధార్మిక కిరణ చికిత్సతో తత్సంబంధిత సూక్ష్మ జీవులను బలహీనపర్చడం, మందులతో చికిత్స చేయడం యివి యీనాడు ఆమోదం పొందిన చికిత్సా పద్ధతులు. శస్త్రచికిత్సా పద్ధతులు మాత్రమే అభివృద్ధి చెందుతూండటంతో అనేక విషయాల్లో కణితి చికిత్సా శాస్త్రం చీకటి గుయ్యారాల్లోకి నెట్టబడింది. లేసర్లు, నియంత్రిత అనెస్తీషియాలు వచ్చాయి. మైక్రోసర్జరీ అవకాశాలు పెరుగుతున్నాయి. అయితే ఇవన్నీ పాత పద్ధతుల మెరుగైన రూపాల్లు మాత్రమే.

ఆధునిక జీవశాస్త్రం కణితుల విషయంలో భిన్నవైఖరినీ, భిన్న అభిప్రాయాన్నీ నిర్దేశిస్తోంది. కణిత అనేది బలమైన పరిణామక్రమానికి గురైన జీవ కణసముదాయం. మామూలు జీవకణ సముదాయాలకులేని నూతన జీవలక్షణాలు దీనికి ఉంటాయి. క్లుప్తంగా చెప్పాలంటే, కణితి అతి స్వల్పకాలంలో తన రూపురేఖలను మార్చుకునే, అంతుబట్టని నిర్మాణరూపం. యిది ఏ పదార్థానికైనా తన్నుతాను సర్దుబాటు చేసుకో గలదు. — యీ సర్దుబాటు క్రమం మాతృకణాలతో ఎలాంటి పోలికలూ లేని పిల్లకణాలు జన్మించే సద్యోజనిత అనుకరణ. దీనికి మరొక గణనీయమైన ధర్మం ఉంది. యితర జీవులనుండి తీసిన కణసముదాయాన్ని, జీవశాస్త్రపరమైన వికటింపు వల్ల జీవులు స్వీకరించజాలవు. కానీ, కణిత ఈ వికటింపును అధిగమించగలుగుతోంది. ఉదాహరణకు, ఒకరికి మరొకరి కాలేయాన్ని అమర్చినప్పుడు జరిగేది ఇదే. కాని, కణిత, ఈ భేదాలను గుర్తించే లక్షణాలను తొలగించుకుని శరీరానికి గల ఈ నిరోధక క్రమంనుండీ తప్పించుకోగలుగుతుంది. ఈక్రమం ఎలాపనిచేస్తుందో తెలుసుకోవడానికి కణిత, మొదలైన వాటి పెరుగుదల క్రమంలో వికటింపు హరణ పదార్థాలను అధ్యయనం చేయవలసి ఉంది. నేనీ పని చాలాకాలంగా చేస్తున్నాను. యీరంగంలో చెప్పుకోదగిన పరిశోధనలు ఆట్టే కనిపించవు... కణిత శాస్త్రంలో, రోగనిరోధక శక్తి గురించిన అధ్యయనాలు అనువర్తిత స్వభావం గలవి. అవి మౌలిక సమస్యలను పరిష్కరించడంలేదు.

## సంతాన సమస్య

1969లో, పదిహేను సార్లు గర్భస్రావం జరిగిన ఒక స్త్రీ నావద్దకు వచ్చింది. ఆమె మాస్కోలో మంచి ప్రసూతి వైద్యులందరినీ సంప్రదించింది. గర్భస్రావాలను అరికట్టడానికి చేయాల్సిందంతా చేసినప్పటికీ ఫలితం లేక పోయింది. ఆమెకెలా సహాయం చేయాలో నాకు పాలుపోలేదు.

ఆసమయంలో మేము గర్భవతుల రక్తాన్ని, వారి రోగ నిరోధక స్థితినీ అధ్యయనం చేసే కార్యక్రమాన్ని నిర్వహిస్తూండినాము. నాకీ ఆలోచన వచ్చింది. ఈస్త్రీ రోగనిరోధక శక్తిని ఎందుకు మార్చ కూడదు? ఇసుమంతైనా హాని కలిగించని ఒక ఆపరేషన్ చేద్దామనుకున్నాను. ఆమహిళకు ఆమె భర్త చర్మం నుంచీ తీసిన ఒక నాణెమంత ఉన్న ముక్కను ఆమె శరీరంలో అతికించడమే ఆ ఆపరేషన్‌లో చేయాల్సిన పని. ఫలితం! ఆమె గర్భం నిలిచి, ఆమె ఆరోగ్యవంతమైన బిడ్డను కన్నది. ఈసంఘటన తర్వాత (ఈ కేసు వైద్య బృందాల్లో యెంతో సంచలనం కలిగించింది). మేము యిలాంటి 13 ఆపరేషన్లను విజయ వంతంగా చేశాము. ఈపద్ధతిని యిప్పుడు అఖిల యూనియన్ మాతా శిశు సంరక్షణ పరిశోధన కేంద్రంలో ఉపయోగిస్తున్నారు.

ఈ పద్ధతి ఆశావహంగా ఉందని గుర్తింపు పొంది అభివృద్ధి చెందుతూండినా నాలో అసంతృప్తి పోలేదు. చర్మాన్ని అతికించడం చిన్న ఆపరేషనే కావచ్చు కానీ, ఏమైనా ఆపరేషన్ ఆపరే షనే. నాకు ఈ సమస్యకు ఇంతకన్నా సరళమైన పద్ధతి ఉండవచ్చు ననిపించింది. పరిశోధనలో ఏండ్లు గడిచిపోయాయి. తుదకు, చర్మాన్ని అతికించడానికి బదులు భర్తరక్తంలోని కొన్ని పదార్థాలను ఇంజెక్షన్ చేస్తే సరిపోతుందని తేలింది. ఆపరేషన్ స్థానాన్ని ఇంజెక్షన్ ఆక్ర మించింది.

**కేన్సర్‌ను కనుగొనే పద్ధతిని గురించి మరిన్ని విషయాలు**

మా పరిశోధనా గమ్యం రోగనిరోధక శక్తి నిర్ణయ శాస్త్రం కాదు. మేము దానికి యాదృచ్ఛికంగా మళ్ళాము. కేన్సర్ కణితులకే గాక, యితర రోగా లకు కూడా రోగ నిరోధక చికిత్సా పద్ధతులను కనుగొనడం మాలక్ష్యం. ఉదాహరణకు, సెప్సిస్ సమస్య, బాక్టీరియా క్రిమి దోషాల సమస్య ఇప్పుడు మావైద్యశాలల్లో ప్రధాన అధ్యయనాంశం అయింది. అనేక యాంటీబయటిక్ ఔషధాలు పని చేయడంలేదు. అంతేకాదు. ఇప్పుడు యాంటీబయటిక్ ఔషధాలపై బతికే విషక్రిములు బయలుదేరాయి.

ఆవిధంగా రోగ నిరోధక చికిత్సా పద్ధతులపై పరిశోధనా కృషి సల్పేటప్పుడు మేము మా రోగుల రక్త పరీక్షలు తరచుగా జరిపే వాళ్ళం. మేము వివరించజాలని ఒక విశేషం మా పరిశోధనా కృషిలో ఒకసారి బయటపడింది. రక్త పరీక్షలు జరిపేటప్పుడు సాధారణంగా లెక్క బెట్టేది తెల్ల కణాలను. వాటికి బదులు లింఫు కణాలను లెక్కించినప్పుడు, వీటిలోని అతి చిన్న కణాల సంఖ్య తగ్గడమనేది ప్రమాదకరమైన కణితులున్న ప్పుడు మాత్రమే జరుగుతుందని రుజువైంది. అవి యెందుకు చిన్నగా ఉంటాయో తెలీదు. వాటి పరిమాణం మాత్రమే వాటిని గుర్తించే యేకైక మార్గం. గాజుఫలకపై రక్తపు బొట్టును సూక్ష్మదర్శినిలో చూస్తే మనకు త్రాంబోసైట్ కణాలు -అతి చిన్న రక్తకణాలు - కనిపిస్తాయి. ఆ రక్తపు బొట్టులో ఎరిత్రోసైట్లు (ఎర్రరక్తకణాలు), ల్యూకోసైట్లు (తెల్ల రక్తకణాలు) చెల్లా చెదురుగా కనిపిస్తాయి. యివి త్రాంబోసైట్లకన్నా పెద్దవి. ఎర్రరక్త కణం పరిమాణంగల లింఫు కణాలైనా లేక దానిక న్నా చిన్న లింఫు కణాలైనా కేన్సర్ రోగుల రక్తంలో కనిపించవు. దీన్ని గమనించగానే, మేము "కేన్సర్ రోగుల రక్తాన్నే గాక కీళ్ళ నొప్పులు, న్యూమోనియా వగైరా వ్యాధులతోనూ, గాయాలతోనూ బాధపడుతు న్న డజన్ల కొద్దీ యితర రోగుల రక్తాన్ని కూడా పరీక్షించనారంభించాము. కేన్సర్ కణితి వున్న వారిలోనే యీ కణాలు లేవు. యిదంతా పూర్తి అసహజంగా కనిపించింది. రక్తపు బొట్టు స్లైడును ప్రయోగశాల ఉద్యోగి తీసుకుని సూక్ష్మదర్శిని కింద పరీక్షించి, ప్రామాణిక రక్తపరీక్షలో వలె 100 కణా లను గాక, 200 లేక 300 కణాలను లెక్క బెట్టి, రోగనిదానాన్ని గావించాడు. ఊహించని ఫలితాన్ని నేను నమ్మలేక పోయాను. యిదే సరైన పరీక్ష పద్ధతి అని తేలింది. మామూలు పద్ధతిలో జరిగే ప్రయోగాలు కూడా రేపో, మాపో గొప్పవిషయంగా పరిణమిస్తాయి. రెండేళ్ళ క్రితం ఈ కొత్త విశ్లేషణాపద్ధతి సరైనదని రుజువైంది. నా సహోద్యోగిని ఎన్.యెఫీయ్‌త్సేవాతో కలిసి నేను నా పరిశోధనను అధికారపూర్వక గుర్తింపుకోసం సమర్పించాము. 1987 వేసవిలో ఈగుర్తింపు లభించింది.

# సోవియట్ యూనియన్ భారతదేశం తలపెట్టిన పరిశోధనా ప్రాజెక్టులు



**సోవియట్ యూనియన్ - భారతదేశాల మధ్య శాస్త్ర, సాంకేతిక సహకార సమగ్ర దీర్ఘకాలిక కార్యక్రమ నిర్వహణలో సాధించిన ప్రగతిపై ఇజ్వెస్తియా విలేకరి నికొలాయ్ పాక్లిన్‌కు సోవియట్ విజ్ఞానశాస్త్రాల అకాడమీ అధ్యక్షుడు గూరి మార్చుక్ ఇంటర్వ్యూ.**

మార్చుక్: ఈకార్యక్రమం ప్రకారం తలపెట్టిన శాస్త్రసాంకేతిక సంయుక్త పథకాల సంఖ్యా దృష్ట్యా చూచినపుడు యిదొక అపూర్వ కార్యక్రమం. సంయుక్త పరిశోధనను గణనీయంగా త్వరితపర్చడానికి యీ కార్యక్రమం సహాయపడింది.

ప్ర: ఈ కార్యక్రమ ఫలితాలేమిటి?

జ: బొంబాయిలోని అణు పరిశోధనా కేంద్ర సహకారంతో సైబీరియన్ విజ్ఞానశాస్త్రాల అకాడమీ తాలూకు న్యూక్లియర్ ఫిజిక్స్ ఇనిస్టిట్యూట్ యెంతో కృషి సల్పింది. యీ ఇనిస్టిట్యూట్ బొంబాయి కేంద్రానికి అత్యంత సున్నితమైన ఎలక్ట్రాన్ యాక్సలరేటర్‌ను అందజేసింది. యీ రెండు సంస్థల శాస్త్రవేత్తలు సింక్రోట్రోన్ రేడియేషన్ సాధనాన్ని తయారు చేయడంలో నిమగ్నమై వున్నారు. యిది యెంతో ముఖ్యమైన ప్రాజెక్టు. మైక్రో ఎలక్ట్రానిక్స్‌లో ప్రగతికి యిది ప్రేరణ యివ్వగలదు; విస్తృత పరిధిగల జీవశాస్త్రపరమైన పరిశోధనా సమస్యల పట్ల నూతన వైఖరిని రూపొందించుకోడానికి తోడ్పడగలదు.

ప్ర: వేరే యింకేమైనా సంయుక్త పరిశోధనా ప్రాజెక్టులున్నాయా?

జ: ఉదాహరణకు, భూగర్భజల అన్వేషణనే తీసుకోండి. యిది భారతదేశానికి యెంతో ముఖ్యమైనది. శ్రీరాజీవ్ గాంధీ సూచనపై దీన్ని సహకార ఒప్పందంలో చేర్చడం జరిగింది. సైబీరియా విజ్ఞానశాస్త్రాల అకాడమీ తయారు చేసిన ఓ కొత్త పరికరాన్ని భారతదేశంలో పరీక్షించాం. యీ పరికరం **60-100** మీటర్ల లోతునగల నీరును పసిగట్టగలదు. చాలా ఖర్చుతోకూడిన డ్రిల్లింగ్ అవసరం లేకుండా యిది చేస్తుంది.

ప్ర: సంయుక్త పరిశోధనకు సోవియట్ దోహదాన్ని గురించే యింతవరకూ మీరు చెప్పారు?

జ: సంయుక్త పరిశోధనా ప్రాజెక్టుల్లో భారతదేశ శాస్త్రవేత్తలు కూడా పాల్గొంటున్నారు. ఉదాహరణకు, సైబీరియన్ విజ్ఞానశాస్త్రాల అకాడమిలో అకడమీషియన్ జమరయేవ్ ఆధిపత్యాన పరిశోధకుల బృందమొకటి మిథేన్‌నుండి ఇథిలిన్‌ను తయారుచేసే ఒక కొత్త సమర్థమైన ఉత్ప్రేరకాన్ని కనుగొన్నారు. దీని రెండవ దశకు — ఇథిలిన్‌ను ఆక్సయిడ్స్‌గా మార్చడానికి— అవసరమైన అత్యంత శక్తివంతమైన ఉత్ప్రేరకాన్ని పూనాలోని జాతీయ రసాయనిక ప్రయోగశాల శాస్త్రజ్ఞులు రూపొందించారు. ఈరెండు దశలను విలీనం చేసి మౌలికంగా ఒక నూతన క్రమాన్ని సృష్టించవచ్చు. యిలాంటి కొత్త క్రమాన్ని ప్రపంచంలో యెక్కడా యింతవరకు వినియోగించలేదు.

భారతదేశ శాస్త్రజ్ఞులు బసాల్ట్ ఫైబర్‌ను అభివృద్ధిచేసి దాని మచ్చులను సైబీరియా అకాడమీకి అందజేశారు. పౌడర్ మెటలర్జీ కోసం ఒక సంయుక్త కేంద్రాన్ని యేర్పాటు చేయాలని హైద్రాబాదులోని మెటలర్జిస్టులు, బైలో రష్యన్ శాస్త్రజ్ఞులు అంగీకరించారు. ఇంకా యిలాంటి యెన్నో వుదాహరణలను పేర్కొనగలను..... (ఇజ్వెస్తియా)

# లేఖలు

### శాంతియోధులుగా శాస్త్రజ్ఞులు

దేశాలమధ్య శాంతి, స్నేహాలను నెలకొల్పడంలో ప్రస్తుత శాస్త్రజ్ఞుల ముఖ్య పాత్ర అంతకంతకూ ఎక్కువ గుర్తింపు పొందుతోంది. అందువల్ల, 1940 లలోనే అణ్వాస్త్ర వ్యతిరేక పోరాటం జరిపిన ప్రముఖ శాస్త్రజ్ఞుల జీవితాల్ని, వారి కృషిని **సోవియట్ సమీక్ష** ద్వారా పాఠకులకు తెలియజేయాలని భావిస్తున్నాను. వీరిలో రెండవ బులెటిన్ ఆఫ్ ద అటామిక్ సైంటిస్ట్స్ (బి.ఎ.ఎస్.)ను స్థాపించినవారు ఏడు దేశాలకు చెందిన 45 మంది శాస్త్రజ్ఞులు ప్రముఖులు. వీరిలో ప్రపంచ ప్రఖ్యాత సోవియట్ శాస్త్రజ్ఞులు కూడా ఉండటం పేర్కొనదగి వుంది.

**ఎస్.ఆర్.కృష్ణమూర్తి**
మద్రాసు.

ఈ సూచనను దృష్టిలో వుంచుకొంటాము; ధన్యవాదాలు

—సంపాదకుడు.

### మరింత సన్నిహితమైన అనుబంధాల కోసం

1988 ఫిబ్రవరి నుంచీ మీ పత్రిక చదవడం ప్రారంభించాను. అప్పటినుంచి నాకది అలవాటై పోయింది. నాకు సోవియట్ విద్యార్థులను గురించి మరింత బాగా తెలుసుకోవాలని ఉంది.

**కన్వర్‌జీత్, థర్డ్ ఎం.ఏ.,**
హంజాపూర్, (హర్యానా)

మా యువ పత్రిక **యూత్ రివ్యూ** ఈ అంశాలకు గణనీయమైన స్థలం కేటాయిస్తోంది. అయితే, **సోవియట్ సమీక్ష** 10వ సంచికలో సోవియట్ యువతను గురించి ఉపయోగకరమైన సమాచారాన్ని ఇస్తున్నాము. — సం

### అందాల పోటీలు

మీ పత్రికలో వచ్చిన గుణాత్మక మార్పును నేను హృదయపూర్వకంగా హర్షిస్తున్నాను. సోవియట్ యూనియన్‌లో అందాల పోటీలు జరిపేటప్పుడు దృష్టిలో ఉంచుకునే ప్రమాణాలూ, లక్ష్యాలను తెలుసుకోగోరుతున్నాను. పాశ్చాత్య ప్రపంచంలో యీ పోటీల్లో కనిపించేది స్త్రీల పట్ల వ్యాపారదృష్టి, జాతీయ స్వార్థం, కామం, సెక్స్, స్త్రీ శరీర ప్రదర్శన. సోవియట్ యూనియన్‌లో అవి శరీర లావణ్యాన్ని, అంగసౌష్ఠవం పట్ల శ్రద్ధను పెంపొందిస్తాయని ఆశిస్తున్నాను.

**హ చమన్,**
పంజాబీ రచయిత కోట్కాపూర (పంజాబ్)

### యుక్తమైన ప్రశ్న

మీ దేశాన్ని, సోషలిస్టు కుటుంబాన్ని, ప్రపంచ శాంతి ఉద్యమాన్ని గురించి తెలుసుకోవడానికి **సోవియట్ సమీక్ష** నాకెంతో ఉపయోగపడుతోంది. వర్గ రహిత సమాజమైన సోషలిస్టు సమాజం లోపలే అధికారం కోసం పెనుగులాట, అధికార ముఠాలు ఏర్పడటం లాంటి వాటికి (యీ పరిణామం మార్క్సిజానికి అన్యమైనది) సంబంధించిన ప్రశ్నలకు సమాధానం లభించటంలేదు. వాటిని గురించి మీ పత్రికలో సవివర సైద్ధాంతిక చర్చలు జరపటం చాలా ఉపయోగకరంగా ఉంటుంది.

**ప్రిజేందర్ హూమా**
క్రాంతి కుటీ, లంజేరా, (జమ్మూ-కాశ్మీర్)

సోవియట్ సమీక్ష 7 వ సంచికలో మీ ప్రశ్నకు సంబంధించిన విషయంపై పెద్ద వ్యాసాన్ని ప్రచురించాము.

—సంపాదకుడు

### పాఠకుల భాగస్వామ్యం

నేను పదేళ్ళుగా **సోవియట్ సమీక్షను** క్రమం తప్పకుండా చదువుతున్న పాఠకుణ్ణి. ఈ పత్రిక రూపాన్ని, విషయాన్ని పునర్వ్యవస్థీకరించినందుకు సంపాదక వర్గానికి అభినందనలు. ఈ పత్రికను మరింత మెరుగు పర్చడానికై, పాఠకుల అభిప్రాయాలూ, సూచనలకు కనీసం ఒక పేజీ కేటాయించాలి.

**అఫ్జల్‌మియా బాని** నాగార్జునసాగర్ (ఎ.పి)

### అభినందన

క్రొత్త ముస్తాబులో ఉన్న **సోవియట్ సమీక్షను** చదవడం ఆనందదాయకంగా ఉంది. దీనిలోని విదేశాంగ విధాన విభాగం, శాంతి గమ్యానికి సంబంధించిన సమస్త ప్రపంచ సమస్యల పట్ల సోవియట్ యూనియన్ తీసుకున్న సాహసోపేత వైఖరిని స్పష్టంగా చిత్రిస్తోంది. సోవియట్ యూనియన్ ప్రస్తుత నాయకత్వం శక్తివంతంగా ముందుకు తీసుకు వెళుతున్న ప్రపంచ శాంతి భావన యెంతో అభినందనీయమైనది.

జి.పి.బాబూరాజ్
పి. నాగరాజ్
పి. పూరాజ్
తిరుప్పూర్

# ప్రాణప్రదా విజ్ఞాన, సాంకేతిక శాస్త్రాల అభివృద్ధి

*సాంకేతిక శాస్త్రంలో నూతన విజయాలు మౌలికంగా కొత్తవైన సాంకేతిక శాస్త్ర క్రమాలు, జన్యు లక్షణ పరంపరలపై ప్రభావం నెరపగల క్రొత్త పద్ధతులు, జీవ్యావరణ కాలుష్యం, అణుయుద్ధ ప్రమాదం—యివి భూమ్మీది సమస్త ప్రాణికోటికి, ప్రత్యేకించి మానవాళికి ప్రమాదకరమైనవి అయ్యాయి.*

*భిన్న విజ్ఞాన శాస్త్ర శాఖలలో కృషి సల్పుతున్న శాస్త్రజ్ఞులు, విజ్ఞాన, సాంకేతిక శాస్త్రాల అభివృద్ధి ఫలితాలను ఆచరణలో ఉపయోగించడంవల్ల కలుగ గల పర్యవసానాలను అధ్యయనం చేయడానికి కలిసికట్టుగా కృషి జరపాలని పై ప్రమాదాన్ని ఎరిగిన ప్రపంచ ప్రముఖ పండితులు ఉద్యమిస్తున్నారు.*

*సోవియట్ తత్వవేత్త, సోవియట్ యూనియన్ విజ్ఞాన శాస్త్రాల అకాడమీ కరెస్పాండింగ్ సభ్యుడు అయిన ఇవాన్ ఫ్రొలోవ్, ఫ్రెంచి జీవశాస్త్రజ్ఞుడు, ఇంటర్నేషనల్ లైఫ్ ఇన్స్టిట్యూట్ బోర్డు అధ్యక్షుడు అయిన మౌరిసె మారోయిస్ – ఈ ఇరువురు పండితులు జరిపిన సంభాషణ సంక్షిప్తపాఠం దిగువనిస్తున్నాం.*

**మౌరిసె మారోయిస్:** ప్రాణికోటి ప్రకృతి విశిష్ట సృష్టి, ప్రకృతిలోని స్వయం వ్యవస్థీకరణ క్రమాల ఫలితమూను. సూక్ష్మక్రిముల, వృక్షాల లేక మానవుల జీవకణాల్లో కనబడేది ఒకే రకమైన పదార్థాలు. అవి సైటోప్లాజం, క్రోమజోమ్‌లు. జంతు, వృక్ష జీవకణాల విభజన క్రమం, ఒకే రకమైనది. వృక్ష కోటి, జంతుకోటి క్రోమజోమ్‌ల సృష్టి జరుగుతున్నది ఒకే రచనగల న్యూక్లియిక్ ఆమ్లాల చేతనే.

ఆదిలో సరళంగా ఉన్న జీవ పరిణామక్రమం తరువాత సంశ్లిష్టమైంది. ప్రాణికోటి మనుగడకోసం కొన్ని రకాల జీవులు అంతరించవలసివచ్చింది. వాటి అవశేషాలు అయిన అణువులు, కణాలు నూతన జీవులకు ప్రాతిపదిక అవుతున్నాయి.

గొప్పదనం గల ప్రాణికోటికి గొప్ప భవితవ్యం కూడా ఉంది. అయితే, ఆ భవితవ్యం మానవుడికి కూడా ఉందా లేదా?

**ఇవాన్ ఫ్రొలోవ్:** ప్రాణి రక్షణ కోసం మనం సమిష్టిగా పాటుపడవలసిన అవసరమున్న మాట నిజమే. నిత్య జీవితంలో ఏది సజీవమో, యేది నిర్జీవమో ఎల్లప్పుడూ చెప్పలేము. కాబట్టి ఇది మరింత అవసరం.

మనస్తత్వాల జడత్వం వల్లా, అవి బండబారి పోవడం వల్లా మనం బాధపడుతున్నాము. ఆధునిక ప్రజల మధ్య పరస్పర అవగాహనకు ప్రధాన అడ్డంకిగా ఉన్నది యిదే.

ఇది ఈ సమస్యలో ఒక అంశం మాత్రమే. ఇక జీవశాస్త్ర అధ్యయనాలను గురించి చెప్పా

లంటే సమాజం పైనా, పుత్పత్తి అభివృద్ధి (బయో టెక్నాలజీ మొదలైనవి)పైనా, మానవుని పైనా (జీవశాస్త్ర విజయాలను వైద్య శాస్త్రంలో ఉపయో గించడం మొదలైనవి) జీవశాస్త్రానికున్న ప్రభావా న్ని గురించీ, జీవశాస్త్రంపై వీటికున్న ప్రభావాన్ని గురించీ యిక్కడ చర్చించడం ఉపయోగకరంగా ఉంటుందని అనుకుంటున్నాను: కొన్ని బయో మెడికల్ ప్రయోగాలు నైతికంగా ఆమోదయోగ్యమా, కాదా అనే విషయం, జన్యువుల నియంత్రణ, జెనెటిక్ ఇంజనీరింగు కృషిలో ఇమిడివున్న నైతిక సూత్రాలు, మానసిక శస్త్ర చికిత్సతో సహా కొన్ని రకాల మనో శరీర ధర్మశాస్త్ర పరిశోధన, అంటే మానవుని ఆరోగ్యానికి, లేక పరిసరాలకు హానికర మైనవీ, మానసిక స్థితిని మార్చడానికి చేసే ప్రయో గాలూ (యిలాంటి ప్రయోగాలు జరపడమంటే ప్రజల న్యాయమైన హక్కులను స్వేచ్ఛలను ఉల్లంఘించడమే). యీ రంగంలో విస్తృత సమస్యలున్నాయి. పరిశోధనలను క్రమబద్ధం చేసే నైతిక సూత్రాలన్నింటినీ రూపొందించడం జరిగి నందువల్ల ఈసమస్యలను పరిష్కరించే కొన్ని ప్రయత్నాలను ఇప్పటికే చేయడం జరిగింది.

అయితే ఈ విషయం దానికి మాత్రమే పరిమితం కాలేదు. నీతి సూత్రాలు శాస్త్రీయ ప్రజ్ఞానాన్ని క్రమబద్ధంచేసే పాత్రను నిర్వహించజాలవు. నీతి సూత్రాలకు కొన్ని సామాజిక సంస్థలతోడ్పాటు ఉంటేనే అవి ఫలప్రదమవుతాయి.

బయోమెడికల్ రంగంలోని పరిశోధన విషయంలో ప్రత్యేకించి కష్టభూయిష్టమైన సమస్యలు తలెత్తుతాయని వేరే చెప్పనవసరంలేదు. నూతన జెనెటిక్ పద్ధతులు, అవయవాల మార్పిడి, న్యూరో సర్జరీ, న్యూరో ఫార్మకాలజీ — వీటి ద్వారా మానవుని వ్యక్తిత్వాన్ని మార్చే అవకాశంవుంది. యిందువల్ల, రానున్న తరాల భద్రతా సమస్య ప్రత్యేకించి తీవ్రతరం అయింది. శాస్త్రజ్ఞులకు, నమాజానికి ఎదురవుతున్న సమస్యలను పరిష్క రించడం అంత సులభమేమీ కాదు. యిది ప్రపంచ ప్రజలకు తీవ్ర ఆందోళన కలిగించడం సహజమే.

మౌరిస్ మారోయిస్: తమ కృషి ఫలితాల విషయంలో శాస్త్రజ్ఞుల బాధ్యతను గురించి ప్రస్తా వించారు. ఇది అతి ముఖ్యమైన విషయం.

నేను జీవశాస్త్రజ్ఞుణ్ణి. విశ్వాన్ని, సచేతన ప్రపంచాన్ని శాసించే అద్భుత నియమాలను చూచి మాకు కలిగే ఆశ్చర్యానికి మేరలేదు. ఆ ఆశ్చర్యం గౌరవంగా మారుతుంది. అది మానవుడు ప్రాణికోటిని నాశనం చేయకుండా అడ్డుకోవడానికి మమ్మల్ని ప్రేరేపిస్తుంది.

విజ్ఞానశాస్త్రం పాత్ర ఎలా ఉండాలి?

విజ్ఞాన శాస్త్రం విశ్వాన్ని గురించిన మన అవగా హనను సుసంపన్నం చేస్తుంది. అది తత్వవేత్తలకు, నైతిక వాదులకు మెదడుకు మేతనిస్తుంది, ప్రభు త్వాల నిర్ణయాలపై ప్రభావం నెరపుతుంది. ఉత్ప త్తికి ప్రాతిపదిక అవుతుంది. అయితే అది తత్వ వేత్తల, నైతికవాదుల, ఉత్పత్తిరంగ మేనేజర్ల పాత్ర ను నిర్వహించజాలదు-యిక్కడ మరొక రకమైన శక్తి అంటే 'వివేచనా శక్తి నిర్ణాయిక పాత్ర వహి స్తుంది.

వాస్తవాన్ని అధ్యయనం చేయడంలో శాస్త్రజ్ఞులు ప్రకృతి నియమాలను బయటపెట్టడానికి కృషి చేస్తున్నారు. శాస్త్రజ్ఞులకు సమాజంలో గొప్ప పేరు ప్రతిష్ఠలున్నాయి. విజ్ఞాన కోశం తాళం చెవి వీరివద్ద ఉండటం, మానవాళికి తన భవితవ్యాన్ని తన చేతిలో ఉంచుకునే సాధనాలు వీరు సమకూర్చు తూండటం యిందుకు కారణం. జ్ఞానం కోసం పోరాడుతున్న వీరులు వీరు.

శాస్త్రజ్ఞులకు విజ్ఞాన శాస్త్ర శక్తి తెలుసు. మౌలిక మార్పునకు పనికి వచ్చే సాధనాలను వారు సృష్టి స్తారు. వారు భవిష్యత్తుకు వారధిలాంటివారు.

విజ్ఞానశాస్త్రాన్ని మానవుడు మంచికైనా చెడు కైనా వుపయోగించుకోవచ్చు. అంతరించి పోయే ప్రమాదాన్ని నేడు సమస్త ప్రాణికోటీ ఎదుర్కొంటోంది. ఈ ప్రపంచ వ్యాప్త ప్రమాదాన్ని ఎదుర్కొనేటప్పుడు మనకు ప్రాణి గడిచివచ్చిన సుదీర్ఘ పథం, దాని యుద్ధాలు, విధ్వంసక శక్తులకు దాని ప్రతి ఘటన, దాని విజయాలు గుర్తు వస్తున్నాయి. ప్రాణంపై తీపి ప్రాణికోటి తన తిరుగు దాడిని రెట్టింపు చేసేలా చేస్తోంది.

మానవునికి నేడు గతస్మృతులకంటే, భవిష్యత్తును గురించి పథకాలే యెక్కువగా ఉన్నాయని నా అభిప్రాయం. అతడు భవిష్యత్కాలంలో తల మునకలుగా నిమగ్నుడయాడు.

ఆధునిక చరిత్రలోని నేటి సంక్షుభిత పరిస్థితి నూతన పునరుజ్జీవం ఆగమనాన్నీ నూతన యుగ ఆవిర్భావాన్నీ సూచిస్తోంది. యిది మన జీవితాన్ని అర్థవంతం చేస్తోంది. మనకు వేగుచుక్కగా ఉపయోగపడుతోంది. మనకు వెలుగునిస్తున్న అంశాలు రెండు: ఒకటి, జీవితం యెంతో విలువైనదన్న గుర్తింపు; రెండు, మానవుని ఔన్నత్యం, స్వేచ్ఛ, బాధ్యతలు వేరుని నిలదొక్కుకోవడం.

గౌగుయిన్ వేసిన మూడు భాగాల చిత్రానికి ఈ సుప్రసిద్ధ శీర్షిక వుంది. "మనమెప్పుడు వచ్చాం, మనమెవరం, మనమెక్కడికి వెడుతున్నాం?" మనం కాలగర్భంలో పుట్టాము. అనాదిగా, ప్రాణికోటి ఆవిర్భవించిన దాదిగా ఉంటున్నాం. మనం యెవరం? శాశ్వత ప్రేమ, ఆశలకు పుట్టిల్లయిన చైతన్య విస్ఫులింగాలం, మనమెక్కడికి పోతున్నాం? ఈ ప్రశ్నకు నావద్ద జవాబు లేదు. ఆ జవాబు నమ్రత, ఆశ, సద్భావనా రంగంలో ఉంది.

జీవితం ప్రేమకు ప్రాతమైన వాటిల్లోకెల్లా గొప్పది. కాబట్టి నేను ధాన్ని ప్రేమిస్తున్నాను.

జీవితం నాకు ప్రసాదించిన దానికి నేను కృతజ్ఞుడినై ఉంటున్నాను.

భూమ్మీద జీవించిన, జీవిస్తున్న ప్రతిప్రాణికీ నేను కృతజ్ఞుణ్ణి.

గతంలో జీవించిన, ప్రస్తుతం జీవిస్తున్న యావన్మంది మానవులకూ నేను కృతజ్ఞుణ్ణి.

నేను శాస్త్రజ్ఞులకూ, వీరులకూ, సత్పురుషులకూ, సామాన్యులకూ కృతజ్ఞుణ్ణి.

తాను ఆత్మహత్య చేసుకోవడానికి కొంతకాలం ముందు రొమెయిన్‌గారీ ప్రపంచ దృక్పథం తీవ్ర నిరాశా వాదంతో నిండిపోయింది. మానవుడికి భవిష్యత్తులేదనీ, మనుగడ కొనసాగించడానికి ఏ ప్రయత్నం చేసినా అది సందేశంతో కూడిన సీసాను సముద్రంలోకి వేయడంవంటిదని అభిప్రాయ పడ్డాడు. "సముద్రంలో సీసాలు అనేకం ఉన్నాయి. సందేశం మోసుకపోయే సముద్రమే లేదు" అని ఆయన నాతో అన్నారు. నేను నిరాశావాదాన్ని పంచుకునే వాడిని కాకపోవడం వల్ల నేను లైఫ్ ఇన్‌స్టిట్యూట్ అనే నా సీసాను వదిలాను.

**ఇవాన్ ఫ్రొలోవ్:** ఉత్తేజ పూరితమైన మీ మాటలు విన్న తర్వాత నేను తత్వవేత్త పాత్ర నిర్వహించడం కష్టంగా ఉన్నా మీ ఆశావాదంలో

# మానవుడూ విజ్ఞాన, సాంకేతిక శాస్త్రాల అభివృద్ధి

నేను తప్పకుండా పాలుపంచుకుంటున్నాను. ప్రపంచ శాస్త్రజ్ఞుల కుటుంబం ప్రపంచ మానవ కుటుంబంలో భాగమే కాబట్టి ప్రస్తుత చర్చనీయ సమస్యకు పరిష్కారం అన్వేషించడం అంతకంతకూ యెక్కువ కష్టమవుతోంది. అవకాశాలు సన్నగిల్లుతున్నాయి. ఇది స్పష్టంగా కన్పిస్తోంది.

నేటి విభేదాలకూ, తలపాటుకూ కారణం పరస్పర అవగాహనలోపించడమూ, వాస్తవాలను చూడడానికి అయిష్టతాను. యిది యితర రంగాలకు లాగే బయోమెడికల్ పరిశోధనా రంగానికి కూడా ఆందోళన కలిగిస్తోంది. యిందుకొక దృష్టాంతం:

జీవశాస్త్రం, వైద్యశాస్త్రం మానవ సంస్కృతిలో అంతకంతకూ యెక్కువ ముఖ్య పాత్ర వహిస్తున్నాయి; అనేక అభిప్రాయాలు, విలువలతో పాటు, అసలు ఆలోచనా ధోరణి పైననే ప్రభావం నెరపుతున్నాయి. యీ శాస్త్రాల పురోగతి సత్ఫలితాలకు సంతోషించినా, వీటి దుష్ఫలితాలను చూచి ప్రజలు భయపడుతున్నారు. అందువల్లనే వీటి అధ్యయనంలో నైతికాంశాలవట్ల ఇంతటి ఆసక్తి కనబర్చడం జరుగుతోంది.

ఆధునిక మానవుని నాడీ మండలం, మెదడు, జీవపరిణామ క్రమమూ, ఆలోచనా శక్తి ఆవిర్భావాభివృద్ధులూ, అనేక మిలియన్ల సంవత్సరాల పాటు జరగగా, మానవాళి మొత్తం చరిత్రలో జరిగిన విజ్ఞాన, సాంకేతికాభివృద్ధిలో 90 శాతం గత 75 ఏళ్ళలోనే జరిగిందని గణాంక లెక్కలు తెలుపుతున్నాయి.

విజ్ఞాన, సాంకేతిక శాస్త్రాల అభివృద్ధికి పట్టిన కాలానికీ, మానవుని మొత్తం ఆలోచన అభివృద్ధి చెందడానికి పట్టిన కాలానికీ మధ్య అపారమైన అంతరం ఉంది. మానవాళి మనస్తత్వాన్ని మార్చి,

దాన్ని మౌలికంగా కొత్తదైన పరిస్థితికి సర్దుబాటు చేయడానికి కృషి సల్పడంలో, నూతన వ్యూహాన్ని చేపట్ట వలసిందిగా మానవాళికి విజ్ఞప్తి చేయ డంలో మనకు సమస్యలు ఎదురయ్యాయి. ఈ సమస్యలకు ప్రధాన కారణాల్లో యీ అంతరం ఒకటి అని నా నమ్మకం.

మానవాళికి ముఖ్యంగా శాస్త్రజ్ఞుల కుటుంబానికి యీ రోజుల్లో కనీవినీ ఎరుగని పరిస్థితి ఎదురైంది. యిటీవలి వరకూ మనం మనకు పరిశోధన జరిపే నైతిక హక్కువుందన్న అభిప్రాయంతో పరిశోధనా స్వేచ్ఛను సమర్ధించే వాళ్ళం. కాని, పరిస్థితి నాటకీయంగా మారిపోయింది. పూర్వం శాస్త్రజ్ఞుడికి తన పరిశోధనా ఫలితం మానవాళికి మేలు చేస్తుందన్న నమ్మకం ఉండేది. కాగా, యిప్పుడు ఆనమ్మకం లేకుండా పోయింది. యివి యావత్ ప్రపంచ వినాశనానికి దారితీసే ప్రమాదం ఏర్పడింది. ఈ పరిస్థితుల్లో మానవాళి జీవితానికి ఆధారభూతమైన శాశ్వత సత్యాలను గుర్తుచేసు కోవాల్సి వస్తోంది. యీ సత్యాలను విధ్వంసకశక్తిని కొలిచినట్టు మెగాటన్నుల్లో కొలవడం సాధ్యం కాక పోయినా, అవి ఆవిధ్వంసక శక్తిని అరికట్టగలవు. అది, మానవత్వం, యింగిత జ్ఞానాలతో కూడిన వివేచనా శక్తి.

2000వ సంవత్సరం నాటికల్లా అణ్వస్త్రాలను పూర్తిగా నిర్మూలించే కార్యక్రమాన్ని సోవియట్ యూనియన్ ప్రతిపాదించిన విషయం మీకు తెలిసిందే, మొట్టమొదట దీన్ని మిహాయిల్ గోర్బ చేవ్ 1986 జనవరి 15 ప్రకటించారు. తర్వాత సోవియట్ కమ్యూనిస్టు పార్టీ 27 వ మహాసభ కార్యక్రమపత్రాలూ, సోవియట్ కమ్యూనిస్టు పార్టీ 19వ సమావేశ తీర్మానాలూ ధ్రువీకరించాయి యిది తర్వాత అనేక ప్రతిపాదనలు చేయడానికి, ముఖ్యంగా సోవియట్-అమెరికా ఐ.ఎన్.ఎఫ్ సంధి పై సంతకాలు చేయడానికీ స్ఫూర్తినిచ్చింది.

నూతన ఆలోచనా ధోరణి అంటే ఏమిటి? యిది ఊహాస్వర్గం గురించిన కలా? ఆకర్షణీయమైన భావ వాదమా? యీ ధోరణికి దన్నుగా ప్రస్తుత పరిస్థితిని గురించిన శాస్త్రీయ విశ్లేషణ, శాంతి వ్యూహానికి వెన్నెముకగాగల నిర్మాణాత్మక ప్రతిపాదనల సము దాయం లేకపోతే యిది అలాంటిగే అయ్యేది. యితర విషయాలతోపాటు నిరాయుధీకరణ సమస్యలను దశల వారీగా పరిష్కరించడమే యీ వ్యూహలక్ష్యం. యీ వ్యూహం అమలు జరగాలంటే, ఆలోచనా ధోరణి, ముఖ్యంగా రాజకీయ ఆలోచనా ధోరణిలో మార్పు, నూతన పరిస్థితులకు తన్నుతా ను సర్దుబాటు చేసుకోవడం, శాంతి స్ఫూర్తితో ప్రజ లకు బోధ సల్పడం అవసరం.

జీవ్యావరణ పరమైన ఆలోచనా ధోరణికి కూడా యిదే వర్తిస్తుంది.

**మౌరిసె మారోయిస్:** మీరు చెప్పింది పూర్తిగ సరైనదే. ప్రకృతి వారసత్వాన్ని కాపాడటం మన విధి.

యావత్తు ప్రాణి కోటీ, మిగతా భౌతిక ప్రపంచ మూ మానవుని అభీష్టంపై ఆధారపడి ఉండే స్థితికి చేరుకొన్నాము. పూర్వం భూప్రళయాల్లో కొన్ని జంతు, వృక్ష జాతులు అంతరించి పోయాయి. అలాంటి ప్రళయాలనే నేడు మానవుడు యీ విధంగా తెచ్చి పెడుతున్నాడు. అడవులను నాశనం చేసి ఎడారులుగా మార్చడం, జీవజాల నివాసాలను ధ్వంసం చేయడం మొదలైనవి జంతుజాలాన్నే గాక, కొన్ని మానవ జాతులను సైతం నిర్మూలించాడు. పిండం జీవకణాల్లోని క్రో మజోముల పనిలో కలగజేసుకుని తన నాశనాన్ని తానే తెచ్చి పెట్టుకుంటున్నాడు. అభివృద్ధి చెందిన సమస్త ఉన్నత జీవులను మానవుడు అణ్వస్త్ర ప్రయోగంవల్ల నిర్మూలించే ప్రమాదం ఉంది.

నేడు భూమ్మీది సమస్త ప్రాణికోటి, గాలి, నీరు, ప్రపంచ ప్రకృతి సమతూక స్థితి, భౌతిక, జీవ, సామాజిక, సాంస్కృతిక జీవ్యావరణం ప్రమాదంలో పడింది.

ప్రపంచ వ్యాప్తంగా ఖనిజ ఇంధనాన్ని విస్తృతంగా ఉపయోగించడంవల్ల వాతావరణంలో కార్బన్ డయాక్సైడ్ పరిమాణం పెరిగి పోతోంది.

ప్రాణికోటిలోని జన్యుపదార్థాల స్థానే కొత్త వాటిని ప్రవేశపెట్టడం లేదా పునరుద్ధరించడం అసాధ్యం.

# మానవుడా విజ్ఞాన, సాంకేతిక శాస్త్రాల అభివృద్ధి

ప్రస్తుతమున్న ప్రతి జీన్ కూడా రానున్న తరాలకు యెంతో అమూల్యమైనది. ప్రస్తుత స్థాయిలో మానవుడు గనుక ప్రకృతిని దెబ్బ తీస్తూ పోతే ముప్పై ఏళ్ళలోనే జీవ జాలంలో ఐదవవంతు నశించిపోతుంది. సాంస్కృతిక విలువలు, తాత్వికత, మతాలూ, చట్టాలు తరచుగా బోధించే విజ్ఞత వీటిపై మానవుని జీవితం నాణ్యత ప్రధానంగా ఆధారపడి ఉంటుంది. మానవుడు సృష్టించిన సాంస్కృతిక సంపద నిజంగా ఎంతో గొప్పది. కాని, అతని నిర్లక్ష్యానికి, దుబారాకు మేరలేదు.

మానవుడికి ప్రపంచంలో ప్రాణికోటితో పాటు అతని సొంత స్థానం అతనికుంది. మొట్టమొదట ఏది రక్షించాలని అతడు నన్నడిగితే, ఇతర సాంస్కృతిక సంపదతో పాటు, మన కణాల్లో కనిపించకుండా వున్న ''న్యూక్లియిక్ యాసిడ్లను'' అని చెబుతాను.

**ఇవాన్ ఫ్రొలోవ్**: ఈకింది వాస్తవాలను మీదృష్టికి తీసుకరావాలనుకుంటున్నాను.

భూమండలంలోని రాజ్యాలు 20వ శతాబ్దం చివరి దశకాల్లో తమ జి.డి.పి.లో 3-5 శాతం జీవ్యావరణ పరిరక్షణకు కేటాయిస్తాయని ఆర్థిక వేత్తల అంచనా. యిది ఏటా 150 బిలియన్ల డాలర్లకు తక్కువ ఉండదు. పరిసరాల పరిరక్షణ విధానానికి, దాని అమలుకు శాస్త్రీయ, సాంకేతిక దన్ను నివ్వడానికి గణనీయ కృషి జరిగింది.

అణు మహోపద్రవమే సంభవిస్తే ఈకృషి అంతా బూడిదలో పోసిన పన్నీరవుతుందని మీరు చెప్పింది సరైనదే. జీవ్యావరణ శాస్త్రానికీ, రాజకీయాలకూ మధ్యగల సంబంధం జాతీయ స్థాయి లోనే గాక, ప్రపంచ స్థాయిలో కూడా అంతకంతకూ స్పష్టంగా వ్యక్తమవుతోంది. జీవ్యావరణాన్ని పరిశుద్ధంగా ఉంచాలని కోరే ఉద్యమం సామాజిక ప్రాముఖ్యత కూడా అంతే స్పష్టంగా వ్యక్తమవుతోంది.

పరిసరాలను మార్చే పద్ధతులను సైనిక, లేక యితర శత్రుచర్యలలోనైనా ఉపయోగించడాన్ని నిషేధించే ఒప్పందం (దీనిపై సోవియట్ యూనియన్, అమెరికాలతో సహా 33 దేశాల ప్రతినిధులు సంతకాలు చేశారు) ఈసందర్భంలో గొప్ప ప్రాముఖ్యం గలది. వివిధ జీవ్యావరణ ప్రజోద్యమాలు ప్రపంచ రాజకీయాలపై నెరపిన ప్రభావం సుస్పష్టమే. ఈఉద్యమాలు భిన్న సామాజిక, రాజకీయ వ్యవస్థలు గల దేశాలకు చెందిన శాస్త్రజ్ఞుల కృషిని సమీకరించడం గమనార్హం. యీ ఉద్యమాల్లో ఒకటి బల్గేరియాలోని నేచర్ ప్రొటెక్షన్ జర్నల్ అన్న పత్రిక ఆధ్వర్యంలో గల అంతర్జాతీయ ఎకోఫోమ్‌చే స్థాపితమైంది. 1984లో జరిగిన దీని సమావేశం ప్రపంచంలోని జీవ్యావరణ శాస్త్రజ్ఞులకూ, పరిసరాల పరిరక్షణకోసం కృషి సల్పుతున్న యితరులకూ ఒక విజ్ఞప్తి చేసింది. 1986 ఆగస్టులో కూడా ఒక అంతర్జాతీయ సమావేశం (యిదీ బల్గేరియాలోనే) జరిగింది. ఒక కొత్త జీవ్యావరణోద్యమం (ఎకోఫొరం ఫర్ పీస్) స్థాపితమైంది. నాటి నుండీ యిది ప్రపంచ వ్యాప్త ప్రభావం నెరపుతోంది.

జీవ్యావరణ శాస్త్ర సమస్యలూ, ప్రపంచవ్యాప్త సమస్యలూ, వాటి పరిష్కారాలు నేడు ప్రపంచ రాజకీయాలకు ప్రాతిపదిక అయ్యాయి. సామాజికంగా బాధ్యతాయుత వైఖరులుగల శాస్త్రజ్ఞులు, ప్రపంచ సమస్యల పరిష్కారానికి అంతర్జాతీయ సహకారం అవసరమని అంతకంతకూ గ్రహిస్తున్నారు.

ఈ ప్రపంచ వ్యాప్త సమస్యలు మానవాళి జీవితంలోని సమస్త అంశాలపైనా (పాదార్థిక రంగం, సంస్కృతి, భావజాలం, నీతి సముదాయం) ప్రభావం నెరపుతున్నాయి. 2000 వ సంవత్సరం నాటికి యీ ప్రభావం తప్పకుండా పెరుగుతుంది.

మరో ముఖ్యమైన విషయం. అణు ఇంజనీరింగ్ సమస్యలు యెదురైన నేడు కొత్త పద్ధతిలో ఆలోచించడం నేర్చుకొంటున్నాము. రేపు, మైక్రో ఎలెక్ట్రానిక్స్ వంటి కొత్త ఉన్నత సాంకేతిజ్ఞతలు మరింత క్లిష్టమైన సమస్యలను తెచ్చి పెడతాయి. ఈనూతన సాంకేతిజ్ఞతవల్ల మానవునితో, సమాజంతో, ప్రకృతితో ఉన్నత స్థాయి సంబంధాలు అవసరమౌతాయి. అందువల్లనే, వ్యక్తి ప్రయోజనాలను, సమాజ ప్రయోజనాలతోనూ, శాస్త్ర ప్రగతిని మానవాళి భద్రతతోనూ సమన్వయ పరచే నూతన ఆలోచనా ధోరణి కావాలని మేము గట్టిగా చెబుతున్నాము.

# ఢిల్లీ ప్రేక్షకుల హృదయాలను చూరగొన్న స్వెర్ద్‌లోవ్‌స్క్ బ్యాలే బృందం

సాయెన్‌కో

"స్వెర్ద్‌లోవ్‌స్క్ బ్యాలే బృందం ప్రదర్శనకు హాలు నిండటం చాలా కష్టం" అని వినీత్ లూయెవెల్ నాతో అన్నారు. ఆయన భారతదేశంలో సోవియట్ కళాకారుల అతిథి కార్యక్రమాల సమన్వయ కర్త. ఆయన భారతదేశంలో సోవియట్ యూనియన్ ఉత్సవ కమిటీలో పని చేస్తున్నారు. "బోల్షాయ్ బ్యాలే బృందం, తాష్కెంట్ బ్యాలే బృందం లాంటి అగ్రశ్రేణి బ్యాలే బృందాల ప్రదర్శనలను మేము యిప్పటికే చూచి ఉన్నాము. కాబట్టి ఇప్పుడు భారతీయ ప్రేక్షకులను ఆకర్షించడం చాలా కష్టం. ఢిల్లీ పౌరులను ఆకర్షించడం మరీ కష్టం. ఎందుకంటే, వారు మంచి అభిరుచీ, అనుభవమూ గల ప్రేక్షకులు కాబట్టి" అని అన్నారాయన తన అభిప్రాయాన్ని సమర్థించుకుంటూ.

స్వెర్ద్‌లోవ్‌స్క్ బృందం తన ప్రదర్శన ఇవ్వాల్సి నది కామానీ ప్రదర్శనశాలలో. ఢిల్లీలోని అతి సౌకర్య వంతమైనట్టి, పేరు ప్రతిష్టలు పొందినట్టి నాట్య శాలల్లో ఒకటైన ఈ ఆడిటోరియం నిండదేమోనన్న అనుమానాన్ని నా భారతీయ సహచరుని నిర్ధారణలు నాలో రేకెత్తించాయి. నాట్య శాస్త్రజ్ఞుడూ, స్వెర్ద్‌లో వ్‌స్క్ స్టేట్ అకడమిక్ బ్యాలే, ఒపెరా థియేటర్ చీఫ్ బ్యాలే మాస్టర్ అయిన ఎ.ఎ. దెమెన్ త్యేవ్ దర్శకత్వంలో "అతి జాగ్రత్త" అన్న ప్రదర్శన జరగబోయే కామాని ఆడిటోరియంకు, నా అను మానాలు తీర్చుకోవడానికి వెళ్ళాను.

అసలు మొదటి రంగం ముగిసీ ముగియక ముందే హాలు హర్షధ్వానాలతో దద్దరిల్లిపోయింది.



"వేరే కళాభిజ్ఞతా సంప్రదాయాల్లో పుట్టి పెరిగిన భారతీయుల్లో యిలాంటి సంచలనం కలిగించడం ప్రదర్శనను ఉత్తమోత్తమంగా యిచ్చినప్పుడు మాత్రమే సాధ్యం" అని ఆడిటోరియంలో నాపక్కనే కూచున్న సరోజినీ చోప్రా అన్నారు. ఆమె ఢిల్లీలో జరిగే సోవియట్ బ్యాలే ప్రదర్శనలను యెంతో ఆసక్తితో చూచే వ్యక్తి. ఆమె యింతవరకూ వాటిలో ఒక్క ప్రదర్శనను కూడా చూడకుండా వదలలేదు. "స్వెర్ద్‌లోవ్‌స్క్ బ్యాలే బృందం తన కళాకారుల సంఖ్య విషయంలో మాత్రమే బోల్షోయ్ బృందంకంటే వెనకబడినట్టు కనిపిస్తోంది. ఎందు కంటే వీరి సంఖ్య 25 మాత్రమే. అంతే తప్ప నైపుణ్యంలోనూ, కళాత్మకతలోనూ వెనకబడినట్టు యెంతమాత్రమూ కనిపించడం లేదు. అంతేకాదు. ఈ ఉత్సవంలో పాల్గొన్న ఇతర సోవియట్ సృజనాత్మక కళాకారుల బృందాలు, చేయలేని విధంగా ఈ కళాకారుల బృందం అద్భుతమైన రంగస్థలా లంకరణలను తీసుకొచ్చింది.

సాధు బుల్లర్ ఢిల్లీలోని ఒక నృత్య విద్యా సంస్థలో ప్రిన్సిపాల్. వృత్తి సంబంధమైన ఆసక్తితో సోవియట్ నృత్య కళాకారుల ప్రదర్శనను చూడటానికి ఆమె వచ్చారు. మాక్బెత్, లేడీ మాక్బెత్‌ల చేతులపైగల రక్తాన్ని గురించి బ్యాలే పరిభాషలో స్వెర్ద్‌లోవ్‌స్క్ నాట్య శాస్త్రజ్ఞుడు చేసిన వ్యాఖ్యానం అద్వితీయమైనది అని ఆమె అన్నారు.

**మాక్బెత్, అతి జాగ్రత్త** నాటకాలు రెంటినీ ఢిల్లీ టెలివిజన్ రికార్డు చేసిందన్న వాస్తవమే స్వెర్ద్‌లోవ్‌స్క్ కళాకారుల విజయానికి తార్కాణం. భారత దేశంలో సోవియట్ ఉత్సవంపై **టి.వి.** డాక్యుమెంటరీ చిత్రం నిర్మించేటప్పుడు ఈ రెండు నాటకాల యితివృత్తాలనూ, ఉపయోగిస్తారు.

ఈ ఉత్సవంలో పాల్గొంటున్న మా సృజనాత్మక కళాకారుల బృందంలో దాదాపు ప్రతి ఒక్కటీ ఏదో ఒక ప్రత్యేక "భారతీయ యితివృత్తం గల అంశం" ప్రదర్శించడానికి వచ్చింది. స్వెర్ద్‌లోవ్‌స్క్ బృందం యిందుకు మినహాయింపేమీ కాదు. యీ బృందం ఢిల్లీ రంగస్థలంపై ఒక భారతీయ నృత్యాన్ని ప్రదర్శించింది. ఈనృత్యం ఎల్.మెరికుస్ నిర్మించిన "బయదేరే" బ్యాలే లోనిది. సంగీతం, నాట్యశాస్త్రం, లైటింగ్, కళాకారుల దుస్తులు ఈ నృత్యంలో సహజంగా మేళవించారని ప్రేక్షకులు ఏకగ్రీవంగా అంగీకరించారు.

**స్పార్టక్** నృత్యనాటికలో స్పార్టక్, ఫ్రిజియన్ పాత్రలను నిర్వహించిన ఖచతుర్యాన్ తాత్యానాగిచినా, వ్లదీమిర్ పాలొవికిన్‌లు "భారరహిత తూలికల్లాగా గాలిలో ఎగిరారని" **హిందుస్తాన్ టైమ్స్** వ్యాఖ్యానించింది. నాటిక చివరిలో పాలొవికిన్ తన భాగస్వామిని అయిన తాత్యానాను ఎగురవేసినప్పుడు ఆమె బహు సొగసుగా, దాదాపు ఒక హాండ్ కర్చీఫ్‌లాగా అతని భుజాలపై వాలటం చూడ ముచ్చటగా ఉందని భారతీయ విమర్శకులు వ్యాఖ్యానించారు.



"ప్రముఖ అగ్రగామి కళాకారులుగల ఒక బృందాన్ని ఒక విదేశంలో పరిచయం చేయడం ఈ బృంద 75 ఏళ్ళ చరిత్రలో ప్రప్రథమం. ఈబృందంలో అమెరికా, యూరప్‌లలో సుప్రసిద్ధులైన, ఎంతో గుర్తింపు పొందిన లిలియా వోరో బ్యేవా లాంటి ఆర్.ఎస్.ఎఫ్.ఎస్.ఆర్ ప్రజాకళాకారిణి, మారినా బోగ్దనోవా, వెరా అబషేవా, నతాల్యా గోర్ది ఎంకో; యే.అమోస్వ, ఎ.ఫైదొదోర్వ్, వ్లదీమిర్ పోలో విన్‌కిన్‌లాంటి ప్రతిభావంతులైన కళాకారులు వున్నారు" అని ఈబృందనాయకుడు ఎ.ఎ.దెమెన్‌త్యేవ్ ప్రదర్శన అనంతరం ప్రసంగి స్తూ అన్నారు.

మా బృందంలో ఆధునిక సోవియట్ బ్యాలె లోని అనేక పద్ధతుల, ధోరణుల ప్రతినిధులు ఉన్నారు. జానపద నృత్యాలు, ప్రామాణిక నృత్యాలు, ఆధునిక ధోరణులు—వీటిలోని అంశాలన్నిటినీ ఒక కార్యక్రమంలో మేళవించే ప్రయత్నమే భారత దేశంలోని ఈమా ప్రదర్శనలు. భారతీయ ప్రేక్షకుల సానుకూల ప్రతి స్పందనను బట్టి మా సృజనాత్మక కృషి ప్రతిభా సమన్వితమైనదిగా గుర్తింపు పొందిందని చెప్పవచ్చు. మేము పూర్తి తృప్తితో ఢిల్లీనుండి వెళ్లుతున్నాము. సుప్రసిద్ధ సాంకేతిక కేంద్రాలైన జైపూర్, లక్నో, బొంబాయిలతో సహా మరో ఆరు నగరాల్లో మేము ప్రదర్శన లివ్వనున్నాము. వీటిలో మేము 26 ప్రదర్శనల నిస్తాము" అని ఎ.సెమెన్‌త్యేవ్ ముగించారు.

ప్రదర్శనానంతరం బయటికి వెడుతున్న ప్రేక్ష కులలో ఒకరైన వినీత్ లూయెవెల్‌ను నేను కలు సుకున్నాను. ఢిల్లీ సాంస్కృతిక జీవితంలో ఇంతటి అద్భుతమైన ప్రదర్శనను చూడగలగటం నిజంగా తన అదృష్టమని ఆయన ఆనందోత్సాహాలతో అన్నా రు.

## విదేశాంగ విధాన సమస్యలు

# అంతర్జాతీయ భద్రత: ఆసియా-పసిఫిక్ దేశాల పాత్ర

మేజర్ జనరల్ వై. లెబెదేవ్

సువిశాలమైన ఆసియా-పసిఫిక్ మండలం ప్రాచీన నాగరికతలకు ఆలవాలం; ప్రపంచంలోని దాదాపు మూడింట రెండు వంతుల జనాభా నివసిస్తున్న ప్రాంతం. పసిఫిక్, హిందూమహాసముద్రాల అళ్ళలు యీ మండల తీరాలను తాకుతున్నాయి. తూర్పున ఉ రాల్స్ మొదలుకొని మధ్య ప్రాచ్యం, అమెరికాల పశ్చిమ తీరాల వరకూ, దక్షిణాన ప్రశాంత అంటార్కిటిక్ వరకూ యీ మండలం వ్యాపించి వుంది. సోవియట్ యూనియన్, అమెరికా, చైనా ప్రజారిపబ్లిక్, జపాన్, భారతదేశం, కెనడాల లాంటి పెద్ద దేశాల రాజకీయ ప్రయోజనాలు యిమిడివున్న ప్రాంతమిది. యీ మండలంలో ఇండొనీషియా, పిలిప్పైన్స్, వియత్నాం, ధాయిలాండ్, పాకిస్తాన్, ఆస్ట్రేలియా, బంగ్లాదేశ్, ఆఫ్ఘనిస్తాన్, బర్మా, న్యూజీలాండ్ యింకా యితర దేశాలున్నాయి. యీ దేశాల వాటా కూడా ప్రపంచ ఆర్థిక వ్యవస్థలో నానాటికీ పెరుగుతోంది. యిది ప్రపంచ పారిశ్రామిక వుత్పత్తిలో సగానికి పైగా, సరకుల సరఫరాలో దాదాపు మూడింట ఒక వంతు వుంటుంది.

## సైనిక, రాజకీయ అస్థిరత, తలపోటులు గల ప్రాంతం

సామాజిక, రాజకీయ దృష్ట్యా చూచినపుడు యీ బృహత్తర ఆసియా-పసిఫిక్ మండలంలో ఎన్నో సమస్యలున్నాయి. అవి వలనపాలననుండి సంక్రమించినవి, లేదా సమకాలీన సామాజికాభివృద్ధి వైరుధ్యాలవల్ల తలెత్తినవి. యీ మండలంలో చిన్నా పెద్దా వుద్రిక్తతా ఆలవాలాలు, ఘర్షణలు, స్థానిక యుద్ధాలు జరుగుతున్న ప్రాంతాలు వున్నాయి. యివి ప్రపంచ పరిస్థితిపై ప్రభావం నెరపుతున్నాయి. ప్రస్తుత శతాబ్ది వుత్తరార్థంలో జరిగిన 250 సైనిక ఘర్షణల్లో 240 ఆసియా, పసిఫిక్ మండలంలో జరిగాయి. ఇది అణు బాంబులకు గురైన ప్రాంతంకూడా.



ఇంతవరకూ యీప్రాంతానికి సైనికీకరణను నియంత్రించే అంతర్జాతీయ వ్యవస్థగానీ, సమరమైన సంప్రతింపుల వ్యవస్థ గానీ లేదు.

ఈ ప్రాంత భద్రతకు హామీనిచ్చే యెలాంటి నిర్దిష్ట అంశాన్ని అయినా పరిశీలించేటప్పుడు అనేక పక్షాల వైఖరులను పరిగణనలోకి తీసుకోవాల్సివుంటుంది. ఈ మండలంలోని శక్తుల సమతూకాన్ని అంచనా వేయడంకూడా చాలా కష్టం.

ఈ మండలంలోని అనేక దేశాల్లో ప్రత్యేక సామాజిక, ఆర్థిక , జాతీయ, మతతదితర పరిస్థితులున్నాయి. అధికారాన్ని కైవసం చేసుకొని నిలబెట్టుకోవడం తరచు హింసాయుత పద్ధతుల్లో జరుగుతుంది. ప్రభుత్వాలకు సాయుధ ప్రతిఘటనలు అప్పుడప్పుడు సంవత్సరాల తరబడి కొనసాగుతూంటాయి. యిలాంటి ఆంతరంగిక రాజకీయ పరిణామాలు అంతః ప్రభుత్వ ఘర్షణలకు అనుకూల వాతావరణాన్ని సృష్టిస్తాయి. క్లుప్తంగా చెప్పాలంటే యూరప్‌లో లాగానే యిక్కడ ప్రాంతీయ భద్రతకు హామీ కల్పించే పద్ధతులూ, మార్గాలూ అంతసరళంగా వుండవు.

ఇది నిజమే. కాని ఈ మండల భద్రతకు హామీ కల్పించాల్సిన కర్తవ్యం తక్షణమైనదిగా, ప్రాముఖ్యంగలదిగా రూపొందుతోంది. యెందుకంటే యిటీవలి సంవత్సరాల్లో యీ మండలం పాత్ర అంతర్జాతీయ సంబంధాల్లో గణనీయంగా పెరిగింది; స్థానిక పరిణామాలు ప్రపంచసైనిక, రాజకీయ పరిస్థితిపై నానాటికీ శక్తివంతమైన ప్రభావాన్ని నెరపుతున్నాయి. యీ మండలంలోని యెలాంటి విస్ఫోటక పరిస్థితి అయినా సరే స్థానిక ఘర్షణ పరిమితులను సునాయాసంగా దాటి ప్రపంచశాంతికి తీవ్రసమస్యలను సృష్టించగలదు.

ఆసియాలో సోవియట్ యూనియన్‌కు చాలా నిడివైన భూసరిహద్దు వుంది. యిది పసిఫిక్ తీరస్థ దేశాల్లోని పెద్ద దేశాల్లో ఒకటి. సోవియట్ యూనియన్ భూభాగం 22,400,000 చదరపు కిలో మీటర్లలో 75 శాతానికిపైగా ఆసియాలో వుంది. అందువల్ల ఆసియా, పసిఫిక్ మండలాన్ని ఉద్రిక్తతలనుండి, సైనిక ఘర్షణల నుండి దూరంగా వుంచాలనే ఆసక్తి సోవియట్ యూనియన్‌కు యెంతో వుంది. సమగ్ర అంతర్జాతీయ భద్రతా వ్యవస్థను సృష్టించాలని సోవియట్ కమ్యూనిస్టు పార్టీ 27 వ మహాసభ ప్రతిపాదించిన భావనను దృష్టిలో పెట్టుకుని యీ మండలంలోని మొత్తం సమస్యల పట్ల, ఘర్షణల పట్ల సోవియట్ యూనియన్ తనవైఖరిని రూపొందించుకుంటోంది.

## ఆసియా-పసిఫిక్ శాంతి, భద్రతల కార్యక్రమాలు

ఆసియా పసిఫిక్ మండలంలో చిన్నవీ, పెద్దవీ, సోషలిస్టు దేశాలు, పెట్టుబడిదారీ దేశాలూ, అలీన దేశాలు, సైనిక కూటాల్లో భాగస్వామ్యంగల దేశాలు అనేకం వున్నాయి. అందువల్ల యీ మిసిలీ యుగంలో మానవాళిమనుగడా, మాండలిక భద్రత, ప్రపంచ భద్రతలకు హామీ చాలావరకు యీ మండలంపైనే ఆధారపడి వుంది.

పైన పేర్కొన్న ప్రతికూలధోరణులు యెన్నైనప్పటికీ యీ మండలంలో అణ్వస్త్రాలవ్యాప్తిని నిరోధించడానికి స్థానిక శక్తులు పుధృతం చేసిన కృషిని ఎవరూ ఉపేక్షించజాలరు. యీ మండల ప్రజలకు సురక్షితమైన భద్రతను యీశక్తులు డిమాండ్ చేస్తున్నాయి. ఆసియా, పసిఫిక్ రాజ్యాలపైన సోవియట్ యూనియన్ యీక్రమానికి క్రియాశీలంగా తోడ్పడుతోంది.

వ్లాదివోస్తోక్‌లో (1986 జూలై) ప్రసంగిస్తూ మిహాయిల్ గోర్బచేవ్ ప్రతిపాదించిన కార్యక్రమం, తర్వాత ఇండొనీషియా పత్రిక మెర్డెకాకు (1987 జూలై 21) న యిచ్చిన యింటర్వ్యూలో యీ కార్యక్రమానికి ఆయన యిచ్చిన విశదీకరణలు — యివి ఆసియా పసిఫిక్ సమస్యల పరిష్కారంలో నూతనరాజకీయ ఆలోచనాధోరణికి నిర్దిష్ట వ్యక్తీకరణలు. ఆ కార్యక్రమంలోని అంశాలు యివి; రాజకీయ పరిష్కారాలద్వారా ప్రాంతీయ వుద్రిక్తతా ఆలవాలాలను నిర్మూలించడం; అణ్వాయుధ పోటీని నిలుపరించడం; సాయుధ దళాలను, సాంప్రదాయిక ఆయుధాలను తగ్గించడం; అణ్వస్త్రరహిత మండలాలను సృష్టించడం; విదేశీ భూభాగాలపైగల సైనిక స్థావరాలను తొలగించడం; ఆ మండలంలో అన్ని దేశాల మధ్య న్యాయమైన, పరస్పర ప్రయోజనకరమైన ఆర్థిక సహకారాన్ని స్థాపించడం; సైనికరంగంలో పరస్పర విశ్వాస సంవర్ధనా చర్యలను అమలు జరపడం; నిర్మాణాత్మకమైన నిర్ణయాలను సంయుక్తంగా చేయడానికై అఖిల ఆసియా సమావేశానికి సన్నాహాలు జరిపి, దాన్ని నిర్వహించడం.

ప్రపంచ వ్యాప్తంగా దశలవారీగా అణ్వాయుధాలను నిర్మూలించాలని సోవియట్ యూనియన్ నికరంగా అనుసరిస్తున్న విధానం దక్షిణపసిఫిక్‌లో

అణ్వస్త్రరహిత మండల స్థాపనకు అనుగుణమైనది. కొరియా ద్వీపకల్పం నుండి అణ్వాయుధాలను తొలగించాలనే డిమాండ్లు నానాటికీ పెరుగుతున్నాయి. నిరాయుధీకరణ సమస్యలపై చైనా ప్రజా రిపబ్లిక్ తరుచుగా తన అభిప్రాయాన్ని వ్యక్తం చేస్తోంది.

అణ్వస్త్రరహిత, హింసారహిత ప్రపంచస్థాపనకు ఢిల్లీ ప్రకటన (1986 నవంబరులో దీనిపై సంతకాలు జరిగాయి) లో పేర్కొన్న సూత్రాలు, అంతర్ రాజ్యా సంబంధాల్లోని సమస్యలపట్ల నూతన రాజకీయ, తాత్విక వైఖరికి తార్కాణం. శతాబ్దాలుగా మానవాళి సృష్టించిన దాన్నంతటినీ, అసలు మానవాళినే అణ్వాయుధాలు నిర్మూలించే ప్రమాదం యేర్పడినందువల్ల "ప్రస్తుత ప్రపంచ పరిస్థితిని మార్చి, అణ్వస్త్ర రహిత, హింసారహిత, విద్వేష భయాను మానరహిత ప్రపంచాన్ని స్థాపించడం అవసరం" అని యీ ప్రకటన తెలియజేస్తోంది.

సోవియట యూనియన్ చొర ప్రకారం సోవియట్ యూనియన్ ఆసియా ప్రాంతంలోని స్వల్పశ్రేణి, మధ్యశ్రేణి మిసలీలన్నిటినీ ధ్వంసం చేయడం జరుగుతుంది. దక్షిణకొరియా, పిలిప్పైన్స్, డీగో గార్షియాలలోని అమెరికా అణ్వాయుధాలతో నిమిత్తం లేకుండా సోవియట్ యూనియన్ యీపని చేయగలదు. ఆ ప్రాంతంలో అమెరికా తన అణ్వాయుధశక్తిని పెంచబోదని సోవియట్ యూనియన్ ఆశిస్తోంది. సోవియట్ భూభాగాన్ని చేరుకోగల అణ్వాయుధాలను అదనంగా అమెరికా మొహరించకుండా వుండే అణ్వాయుధాలను తీసుకెళ్లగల విమానాల సంఖ్యను తన ఆసియా భాగంలో పెంచకుండా వుండడానికి సోవియట్ యూనియన్ సంసిద్ధతను తెలియజేసింది.

ఆసియా, పసిఫిక్ మండలానికి యూరపియన్ అనుభవాన్ని పరిగణనలోకి తీసుకుని యీ కింది అంశాలను సోవియట్ యూనియన్ బలపరుస్తోంది: యీ మండలంలో సైనిక కార్యకలాపాలను తగ్గించడం; వాయు, సముద్రకమ్యూనికేషన్లలో సహా అంతర్జాతీయ జలసంధులను సురక్షితంగా వుండేట్టు చేయడం; పసిఫిక్‌లో నౌకాదళ కార్యకలాపాలు తగ్గించడానికి, జలాంతర్గాముల పోటాపోటీలను పరిమితం చేయడానికి, పసిఫిక్, హిందూ మహాసముద్రాల్లో దానికి ఆనుకొని వున్న సముద్రాల్లో నౌకాదళ విన్యాసాలను పరిమితం చేయడానికి సంప్రతింపులు జరపడం. యీ మండలంలో అణుపరీక్షల నిషేధానికి, ఆసియాలో సాయుధదళాల, సాంప్రదాయక ఆయుధాల సహేతుక తగ్గింపునకు, సైనిక తలపాటును దశలవారీగా కనీస స్థాయికి తగ్గింపునకు సోవియట్ యూనియన్ అధికప్రాధాన్యత నిస్తోంది.

దక్షిణకొరియా, కొరియా ప్రజాతంత్ర రిపబ్లిక్కులు ఒక్కొక్కటి క్రమక్రమంగా తమసైన్యాలను 100,000 లకు తగ్గించుకోవాలని; తర్వాత కొరియా ద్వీపకల్పంనుండి అమెరికా సైన్యాల వుపసంహరణ జరగాలని సోవియట్ ప్రభుత్వం సూచిస్తోంది. చైనా-వియత్నాం సంబంధాల్లో సాధారణ పరిస్థితిని, ఆఫ్ఘనిస్తాన్‌లో జాతీయ సామరస్యాన్ని, ఇరాన్-ఇరాక్ యుద్ధం నిలుపుదలను; పర్షియన్ సంధూశాఖ నుండి ఆ ఉపమండలానికి చెందిన దేశాల యుద్ధనౌకల వుపసంహరణను సోవియట్ నాయకులు బలపరుస్తున్నారు.

ఆసియా-పసిఫిక్ మండలంలో శాశ్వతశాంతి, భద్రతలకు హామీ కల్పించడానికి ఆ విశాల ప్రాంతంలోని దేశాలు పాత ఆలోచనాధోరణులకు, దురభిమానాలకు, అనుమానాలకు స్వస్తిచెప్పాలి. అంతే తప్ప మరో మార్గం లేదు.

(పాలిటిచెస్కయా ఒబ్రజొవాని పత్రికలోని ఒక వ్యాసానికి సంక్షిప్త పాఠం)

## మిహయిల్ గొర్బచేవ్

రాజ్యాల మధ్య సంబంధాల రంగంలో మన అనుబంధాలకు పరస్పర సంభాషణలనూ, నిరాయుధీకరణ రంగంలో విస్తృత ప్రభావం. నెరపగల పరస్పర తనిఖీని అంగీకరించడానికి సంసిద్ధతనూ ప్రాతిపదికగా చేయడం ప్రారంభించాం. ఇందువల్ల పరస్పర విశ్వాస పరిధి సాంప్రదాయకమైన తాత్విక పరిమితులనుదాటి విస్తృతం కావడానికి వీలేర్పడింది. సిద్ధాంతరీత్యా మనకు చాలాదూరంగా వున్నట్టీ, పలుకుబడి కలిగినట్టీ వర్గాలు సైతం మనతో పరస్పర అవగాహనకు రావడానికీ, సహజీవన, సహకారాలను ఆమోదించడానికీ గణనీయమైన అవకాశ ముందని యిందువల్ల మనం కనుగొన్నాం.

సోవియట్ కమ్యూనిస్టుపార్టీ 19 వ అఖిల యూనియన్ సమావేశానికి సమర్పించిన నివేదిక నుండి

# ఆర్థిక సహకారవార్తలు

# కాస్పియన్ సముద్రంపై సోవియట్-జపాన్ సంయుక్త పరిశ్రమ

కాస్పియన్ సముద్రంపై ప్రపంచంలో కల్లా అతిపెద్దదైన పెట్రోరసాయనాల సంయుక్త పరిశ్రమను సుమారు 5-6 బిలియన్ల డాలర్ల ఖర్చుతో నిర్మించనున్నారు. సోవియట్ యూనియన్‌లో యీ పరిశ్రమయేర్పాటుకు సంబంధించి మాస్కోలో కుదిరిన ఒప్పందంపై సోవియట్ యూనియన్ చమురు పరిశ్రమ మంత్రిత్వశాఖ, అమెరికన్ ఆక్సిడెంటల్ పెట్రోలియం కార్పొరేషన్, ఇటలీకి చెందిన మాంటెడిసన్, ఇఎన్ఐ కంపెనీలు, జపాన్ వాణిజ్య కంపెనీ మారుబెనీ ప్రతినిధులు సంతకాలు చేశారు.

కాస్పియన్ సముద్రంలోని చమురు నిక్షేపానికి గలపేరునే యీప్రాజెక్టుకు పెట్టారు. తెంగిజ్ అనే యీ ప్రాజెక్టు సోవియట్-జపాన్ సంబంధాల్లో ప్రధాన అంశమైంది.

మారుబెనీ రసాయనిక పరిశ్రమశాఖ అధిపతి మాత్‌సుదా తనూకు యీ ప్రాజెక్టుకు సంబంధించిన యీ వివరాలు తెలియజేశారు.

"తెంగిజ్ చమురు నిక్షేపం కొత్తది అయినప్పటికీ యిది 2000వ సంవత్సరం నాటికీ సాలీనా 50 మిలియన్లటన్నుల చమురును వుత్పత్తి చేస్తుంది. చమురుతో పాటు లభించే. గ్యాస్‌లో ఇథేన్, యితర గ్యాస్‌లు యిక్కడ పుష్కలంగా లభిస్తాయి. ఒప్పందం ప్రకారం మా కంపెనీ గ్యాస్‌ను శుద్ధిచేసి చమురు వుత్పత్తుల్లోకి మార్చుతుంది. సోవియట్ యూనియన్ చమురును వెలికి తీసి శుద్ధి చేస్తుంది......

"మొదట మేము గంధకాన్ని (గ్యాస్‌లో యిది 15 శాతం వుంటుంది) వేరుచేసి అమ్ముతాం. మిగతా గ్యాస్‌లో ఇథిలీన్, పాలీఇథిలిన్ పాలీప్రొపిలిన్ యింకా ప్లాస్టిక్ వస్తువుల తయారీకి పనికి వచ్చే పదార్థాలుంటాయి. మొదటి దశలోనే దాదాపు 600,000 టన్నుల ఇథిలిన్, పాలీఇథిలిన్, 400,000 టన్నుల పాలీప్రొపిలిన్ లభిస్తుందని మాఅంచనా.

"గత నవంబరులో యీ సంయుక్త సహకార సంస్థ యేర్పాటుకు సంబంధించిన పత్రంపై భాగస్వాముల సంతకాలు జరిగాయి. ఒప్పందం 1988 మార్చి 16 న కుదిరింది.

"ఈ ప్రాజెక్టు చాల ఖర్చుతో కూడినది, కాబట్టి దీని నిర్మాణం తక్షణమే ప్రారంభంకాదు.....పథకం ప్రకారం అన్నీ సక్రమంగా జరిగితే 1989 లో దీనినిర్మాణాన్ని చేపడుతుతాం. దీని తొలివుత్పత్తులు 1993 లో పొందగలం.

"ఇది తెంగిజ్ ప్రాజెక్టుకు సంబంధించిన సమాచారం. విదేశీ సంస్థలతో సంయుక్త పరిశ్రమల యేర్పాటుకు సోవియట్ ప్రభుత్వం యెంతో ఆసక్తి కనబరుస్తోంది. నాకు తెలిసినంత వరకు విదేశీ సంస్థలతో 28 సంయుక్త ప్రాజెక్టులను సోవియట్ ప్రభుత్వం యేర్పాటు చేయ తలపెట్టింది. వీటన్నిటిలో కన్నా తెంగిజ్ ప్రాజెక్టు పెద్దది.

"ఒప్పందం కుదిరిన మరుసటి రోజున నాలుగు పాశ్చాత్య కంపెనీల అధిపతులు క్రెమ్లిన్‌లో సోవియట్ ప్రధాని రిష్కోవ్‌ను, ఉపప్రధాని కమెన్‌త్సేవ్‌ను కలుసుకున్నారు. యీ ప్రాజెక్టు విజయవంతం కావాలనే ఆసక్తిని సోవియట్ పక్షం కనబర్చింది, అందుకు సహకరించాలని మమ్మల్ని కోరింది... సోవియట్ ప్రభుత్వ సహకారం లభిస్తుందని మేము కూడా ఆశిస్తున్నాం.

"ఈ పెట్రోరసాయనాల బృహత్ ప్రాజెక్టును మారుబెని నిర్మిస్తుంది. దాన్ని పరికరాలతో సన్నద్ధం చేస్తుంది. యేదేమైనప్పటికీ మేము యీ విషయాన్ని భాగస్వాములతో సంప్రదించాలి. మాభాగస్వా

# నికలాయ్

ములలాగానే మారుబెనీకూడా దీని ఉత్పత్తులను విదేశీ మార్కెటులో అమ్ముతుంది. విదేశీ సంస్థలు ఐదు బిలియన్ల డాలర్ల యీ ప్రాజెక్టుకు 2.5-3 బిలియన్ల డాలర్లు సమకూర్చాలి కాబట్టి మారుబెనీ దీనికి డబ్బును యిస్తుంది. పాశ్చాత్యదేశాల్లో డబ్బు లభించడం కష్టం, అందువల్ల యెంతో అనుభవ మున్న మా కంపెనీ ప్రభుత్వంనుండీ, ప్రయివేట్ బ్యాంకులనుండీ పొందే అప్పును యిందుకు వినియోగిస్తుంది.....

"మారుబెని యిప్పటికీ 30 యేళ్లకుపైగా సోవియట్ యూనియన్‌తో వ్యాపారంచేస్తోంది. యీ సహకారం మాకెంతో ముఖ్యమైనది. వాణిజ్యం, ఆర్థిక సంబంధాలు అమూల్యామైనవనీ, యెందు కంటే వాణిజ్య భాగస్వాములు రాజకీయతలపా టులో మునిగిపోరనీ క్రెమ్లిన్‌లో మాతో జరిగిన సమావేశంలో రిష్కోవ్ అన్నారు. అందు వల్ల మనం ఆర్థిక, సాంస్కృతిక ఆదానప్రదానాలను విస్తరించు కోవడం ద్వారా రాజకీయ స్థిరత్వాన్ని భద్రతనూ పెంపొందించుకోవచ్చు.

"ఇక మానంయుక్త ప్రాజెక్టు గురించి. సోవియట్ యూనియన్ మాసంస్థకు యెంతో ముఖ్యమైన భాగస్వామి అని నేను మరోసారి నొక్కి చెప్తున్నాను. ఈ బృహత్ ప్రాజెక్టులో ఆర్థికంగా పటిష్టమైన పెద్దదేశాలు.పాల్గొంటున్నాయి; అమెరి కా, ఇటలీ, జపాన్, యిది యెంతో ముఖ్య మైనది. నాకు తెలిసినంతవరకూ యీ ప్రాజెక్టును అమెరికా ప్రభుత్వం సమర్థించింది. ఇటలీ ప్రభుత్వం కూడా యీ ప్రాజెక్టును గురించి యిదే అభిప్రాయాన్ని వ్యక్తంచేసింది. యీ ప్రాజెక్టు సోవియట్-జపాన్ సంబంధాలను మెరుగుపర్చడానికి దోహదం చేస్తుందనీ అందువల్ల సమ్యంగా వ్యవహరించాల నీ, శక్తివంచనలేకుండా కృషి చేయ్యాలనీ జపాన్ ప్రభుత్వం మాకు విజ్ఞప్తి చేసింది."



నికలాయ్ క్రెస్తీన్ స్కీ గురించిన వివరాలను ఆయన కూతురు తెలియజేసింది. క్రెస్తీన్‌స్కీ వ్యక్తి గత జీవితం ఆయన విప్లవ జీవితంతో విడదీయ లేని విధంగా పెనవేసుకుంది. 1905 లో ఆయనను ప్రభుత్వం అరెస్టు చేసి విల్నా జైలులో పెట్టింది. అప్పుడు ఆయనకు పార్టీలోని పరిస్థితిని వివరించి ఆయన అభిప్రాయాన్ని తెలుసుకునేందుకు పార్టీ కామ్రేడ్లు ఆయనకు "కాబోయే భార్య" అనే పేరుతో ఒక అందమైన అమ్మాయిని ఆయన వద్దకు పంపారు. జైలునుంచీ విడుదల అయ్యాక ఆయన ఆమెను వివాహం చేసుకున్నారు....

ప్రావ్దా పత్రికలో క్రెస్తీన్ స్కీ పనికి ఆయన పార్టీ జీవితంలో ప్రత్యేకస్థానం ఉంది. ఆయన 1912 ఏప్రిల్ 12 న ప్రావ్దా ప్రారంభమైనప్పటి

చరిత్రపుటలు

# క్రెస్తీన్‌స్కీ

ఒక ప్రశ్నావళినుంచీ:

కుటుంబనామం, అసలుపేరు, ఇంటిపేరు: క్రెస్తీన్ స్కీ నికలాయ్, నికలాయెవిచ్

పుట్టిన తేదీ, చోటు: 1883 అక్టోబర్ 25, మగీల్యోవ్.

సామాజిక, ఉద్యోగ హోదా: మేథావి. కార్యాలయోద్యోగి.

విద్య: విశ్వవిద్యాలయ విద్య.

విప్లవానికి ముందు ఉద్యోగం: అటార్నీ ఎట్ లా.

పార్టీసభ్యత్వం: 1903 నుండీ.

నుంచీ, మొదటి ప్రపంచయుద్ధానికి కొంచెం ముందు అంటే 1914 జూలైలో అది మూతబడేదాకా దానిలో పనిచేశారు.

యుద్ధం ప్రారంభంకాగానే క్రెస్తీన్‌స్కీని ప్రభుత్వం తిరిగి అరెస్టుచేసి కొద్దికాలం తర్వాత ఉరల్స్‌కు ప్రవాసం పంపింది. గట్టి పోలీసుకాపలా ఉన్నప్పటికీ ఆయన అక్కడ విప్లవ కృషిలో నిమగ్నమయ్యారు.

ఉరల్స్‌లో సోవియట్ పాలన ప్రారంభంకాగానే ఆయనను అక్కడనుంచీ పెట్రోగ్రాడ్‌కు బదిలీచేసి అక్కడ ఆయనకు ఆర్థిక మంత్రిత్వశాఖలో పదవి నిచ్చారు. (ఆయన పదవి పీపుల్స్ బ్యాంకు ఉప అధిపతి, ఆర్థిక మంత్రిత్వశాఖ కాలేజియం సభ్యుడు) ఈ పదవిలో ఉన్నప్పుడు ఆయన బ్యాంకుల జాతీయకరణకూ, సోవియట్, ఆర్థిక, న్యాయ వ్యవస్థ స్థాపనకూ కృషిచేశారు.

1918 ఆగస్టులో ఆయన ఆర్థిక మంత్రి అయ్యారు 1919 నవంబర్‌లో పార్టీకేంద్రకమిటీ ఎగ్జిక్యూటివ్ కార్యదర్శిగా ఏకగ్రీవంగా ఎన్నికయ్యారు. 1920లో పార్టీ తొమ్మిదవ, 1921లో పదవ మహా సభలకు కీలకమైన నివేదికలను ఆయన సమర్పించారు.

# విప్లవకారుడూ, దౌత్యవ్యవహార్తా, ప్రజాస్వామ్యవాది

డా. నికలాయ్ పాపోవ్

పార్టీ 10 వ మహాసభలో జరిగిన ఈ సంఘటన ఆయన స్వభావాన్ని తెలుపుతుంది. మహాసభ వక్తల్లో ఒకరు నికలాయ్ క్రెస్తీన్‌స్కీని పార్టీ కేంద్ర కమిటీ ప్రధాన కార్యదర్శి అని పేర్కొన్నారు. ముగింపు ప్రసంగంలో దానికి జవాబుగా క్రెస్తీన్‌స్కీ, అలాంటి పదవియేదీ లేదనీ, ముగ్గురు కార్యదర్శులూ సమానమేనని చెప్పారు. తనను "కీర్తించడానికి" యెవరినీ అనుమతించనంతటి నిజాయితీపరుడూ, ఆత్మాభిమానీ ఆయన. పార్టీ ప్రధాన కార్యదర్శి పదవిని 10 వ మహాసభ అనంతరం ఒక సంవత్సరం తర్వాత యేర్పాటు చేయడం జరిగింది. ఆ పదవిలో స్టాలిన్ నియమితుడయ్యారు.

నికలాయ్ క్రెస్తీన్‌స్కీ మంచి ఆర్గనైజరేగాక, సిద్ధాంత వేత్తకూడా. ఆయన సహకారోద్యమ సూత్రాలను రూపొందించారు. పార్టీ 9 వ మహాసభకు ఆయన సహకార సంఘాలపట్ల పార్టీ విధానాన్ని గురించి నివేదికను సమర్పించారు. సహకారోద్యమ నాయకుల బ్యూరాక్రటిక్ పద్ధతులనూ, సహకార సంఘాలపై గల కఠినమైన నియంత్రణలనూ ఆయన తీవ్రంగా విమర్శించారు. పార్టీ సహకారోద్యమం పట్ల తన విధానాన్ని పరిపాలనా సంబంధమైన ఆదేశంద్వారా గాక సహకార సంఘాల్లో పని చేస్తున్న కమ్యూనిస్టులద్వారా అమలు జరపాలని ఆయన ప్రతిపాదించారు.

సహకార సంఘాలపట్ల నికలాయ్ క్రెస్తీన్‌స్కీ అభిప్రాయాలు ప్రస్తుత సోవియట్ సహకార విధానానికి అనుగుణంగా ఉన్న విషయం సుస్పష్టమే. కానీ, ఆకాలంలో అధిక సంఖ్యాక ప్రతినిధులు క్రెస్తీన్‌స్కీని బలపర్చకుండా మరోనాయకుడైన వ్లాదిమిర్ మిత్యాతిన్ రూపొందించిన సూత్రాల పట్ల మొగ్గు కనబరిచారు: సహకార సంఘాలపైన ప్రభుత్వ గట్టి అదుపును సమర్థించే సూత్రాలవి. ఈ సమస్యపై క్రెస్తీన్‌స్కీ "మైనారిటీ తీర్మానాన్ని" ఆమోదించవలసిందిగా మహాసభను లెనిన్ విజ్ఞప్తిచేసి, దాన్ని ఒప్పించారు.

క్రెస్తీన్‌స్కీ సామర్థ్యం, నీతి నిజాయితీలను చూచి లెనిన్ ఆయనకు ఎంతో విలువనిచ్చారు.

1921 లో నికలాయ్ క్రెస్తీన్‌స్కీని దౌత్య వ్యవహార నిర్వహణకోసం పంపారు. జర్మనీలో సోవియట్ దూతగా ఆయన 1922 రాపాల్లో సంధి చర్చల్లో ప్రత్యక్షంగా పాల్గొన్నారు. పెట్టుబడిదారీ దేశాలతో సమాన హోదాలో సంబంధాలు నెలకొల్పుకోవడానికి శైశవ సోవియట్ రిపబ్లిక్ చేసిన ప్రయత్నంలో సోవియట్ దౌత్య నీతి సాధించిన నీతి ఘనవిజయం ఈ సంధి.

1930లో నికలాయ్ క్రెస్తీన్‌స్కీ డిప్యూటీ విదేశాంగ మంత్రి అయ్యారు.

నికలాయ్ కూతురు నటాలియా క్రెస్తీన్‌స్కీ యీలా చెబుతున్నారు: "నాన్నగారు పాతతరం రష్యన్ మేధావులకు మచ్చులాంటి ప్రతినిధి. ఆయనకు ఫ్రెంచి, జర్మన్, లాటిన్ భాషలు తెలుసు. ఆయన జ్ఞాపక శక్తి అద్వితీయం. లెనిన్‌కూ ఈ విషయం తెలుసు. ఏదైనా సమాధానం ఆయనకు తట్టక పోతే "వెళ్ళి క్రెస్తీన్‌స్కీని అడుగు." అని ఆయన తరచు అంటూండేవారు.

"ఆయనకు పనే ప్రధానమైన విషయం. ఆయన పొరపాట్లు చేయలేదా? చేశారు. కాని, తన జీవితాంతం ఆయన లెనిన్ విధానాన్ని బలపర్చారు. పొరపాట్లూ, అభిప్రాయభేదాలూ నూతన పథ నిర్దేశన కాలంలో అనివార్యం. అందువల్ల, లెనిన్ తన పార్టీ సహచరులను, ఒకవేళ వారిదే తప్పయినప్పటికీ, నిందించే వారుకాదు.

స్టాలిన్ కాలంలో పార్టీలోని పరిస్థితి నాటకీయంగా మారిపోయింది. సూత్రబద్ధుడూ, ప్రజాస్వామ్య సంప్రదాయానికి చెందినవాడూ అయిన నికలాయ్ క్రెస్తీన్‌స్కీ సోషలిస్టు వ్యతిరేకమైన స్టాలిన్ వ్యక్తిపూజ వాతావరణంతో, పార్టీసభ్యుల మధ్య యేర్పడ్డ "నూతన" తరహాసంబంధాలతో రాజీపడలేక పోయారు.

ఈ కింది సంఘటన ఆయన స్వభావాన్ని తెలుపు తుంది. 1935 లో ఒకనాటి సాయంత్రం ఆయన కుటుంబంతో థియేటర్‌కు వెళ్ళారు. స్టాలిన్ ఆగ్రహానికి గురైన బుఖారిన్ కూడా థియేటర్‌కు వచ్చారు. ఆయన్ను పలకరించడానికి ఆయన మిత్రులుకూడా భయపడేవారు. నాడు బుఖారిన్ ఉండిన పరిస్థితి క్రెస్తీన్‌స్కీకి తెలుసు. అయినాసరే, ఆయన బుఖారిన్ దగ్గరికి వెళ్ళి చాలా సేపుమాట్లాడారు.

"మనిషికి కష్టంలో ఉన్నప్పుడు తోడ్పాటు కావాలి" అన్నారాయన ఆ తర్వాత తన భార్యతో.

ఆకష్టకాలం త్వరలో తనకూ ఎదురవుతుందని ఆయనకప్పుడు తెలీదు. 1937 వసంతకాలంలో ఆయనను అరెస్టుచేసి, ట్రాట్ స్కీయిస్టు సోవియట్ వ్యతిరేక అభివృద్ధి నిరోధక పక్షంలో చేరాడని నేరంమోపి శిక్షించారు. "భూత భవిష్యత్ వర్తమాన - కాలాలకెల్లా అత్యంత ప్రతిభాశాలి" చెప్పినదాన్ని క్రెస్తీన్‌స్కీ కాదన్న అనేక సందర్భాలను స్టాలిన్ మరిచిపోలేదన్న మాట.

ఇవోల్గిన్‌స్కీ దాత్సాన్‌లో విందు
త్సోగ్చిన్ మందిరం (ఇవోల్గిన్‌స్కీ దాత్సాన్)లో
ఉదయపు ప్రార్థనలు





# సోవియట్ యూనియన్‌లో బౌద్ధ మతస్థులు



# సోవియట్ యూనియన్‌లో బౌద్ధమతస్థులు

బుర్యాత్, తువినియన్ స్వయం పాలిత రిపబ్లిక్కులు, సైబీరియా లోని చీతా, ఇర్కుత్స్క్ మండలాలు కాస్పియన్ పల్లపు ప్రాంతంలోని కాల్మిక్ స్వయం పాలిత రిపబ్లిక్కు — యివి సోవియట్ యూనియన్‌లో బౌద్ధమతస్థులు నివసించే ప్రాంతాలు.

సోవియట్ యూనియన్‌లోని బౌద్ధమతం గెలుక్పా ఒకరకమైన టిబెటన్ మహాయాన అనే శాఖకు చెందిన ఉపశాఖ.

సోవియట్ యూనియన్‌లోని బౌద్ధమతానికి ఒక కర్మకాండగా మారిపోయిన ప్రత్యేక పద్ధతులు ఉన్నాయి. దాత్‌సాన్‌ల వెలుపల నివసించే గ్రామలా మాల వ్యాప్తి సోవియట్ యూనియన్‌లోని బౌద్ధమత విశిష్టలక్షణం. పశుపాలకుల సంచార జీవన సరళే యిందుకు కారణం. ఈ సాంప్రదాయం కొంతమేరకు నేడూ నిలిచి ఉంది.

సోవియట్ యూనియన్‌లోని బౌద్ధమతస్థుల కార్య కలాపాలన్నింటికీ సోవియట్ యూనియన్ బౌద్ధుల కేంద్ర బోర్డు మార్గదర్శకత్వం వహిస్తోంది. ఈ బోర్డులో అధ్యక్షుడు, ఆయన డిప్యూటీ, ఇవోల్గిన్స్క్, అగిన్స్క్ దాత్‌సాన్‌ల, అధిపతులు, యెంతో గౌరవనీ యులైన లామాల, పురోహితులనుండీ యెన్నికైన ఐదుమంది సభ్యులు ఉన్నారు. ఈ బోర్డు మత వ్యవహారాల నిర్వహణతోపాటు, కార్య కర్తల శిక్షణలో బౌద్ధుల ఐక్యతను, అంతర్జా తీయ సౌభ్రాతృత్వాలను పెంపొందించడంలో నిమగ్నమై ఉంది.

### బాందిదో-ఖాంబోలామా జె.జె. ఎర్డీనెయేవ్

సోవియట్ యూనియన్ బౌద్ధుల మత బోర్డుకు బాందిదో - ఖాంబోలమా అయిన జిమ్‌బా జామ్‌సో ఎర్డీనెయేవ్ ఆధిపత్యం వహిస్తున్నారు. ఆయన ఇవోల్గిన్స్క్ దాత్‌సాన్‌లో వుంటారు.

జె.జె. ఎర్డీనెయేవ్ బుర్యాత్ పశుపాలకుల కుటుంబంలో జన్మించారు. ఆయన ఖుబరాక్‌గా (సామాన్య మత బోధకుడుగా) జీవితం ప్రారంభించి, క్రమేణా మతబోర్డు ఉపాధ్యక్షుడయారు. 1983లో అధ్యక్షునిగా ఎన్నికయ్యారు.

బౌద్ధ తత్వ శాస్త్రం, సాహిత్యాలలో ఆయన ప్రగాఢ జ్ఞానం, అసాధారణమైన నమ్రత. ఆయనకు సోవియట యూనియన్‌లోని తన అనుయాయుల లోనే గాక, విదేశాల్లోని బౌద్ధ మతస్థుల్లోకూడా అపార గౌరవం సంతరించి పెట్టాయి. ఈయన దేశాలమధ్య మైత్రికోసం పాటుపడుతున్న శాంతియోధుడు; బుద్ధుని ఉదాత్త మనవతా ఆదర్శాలు (ప్రేమ, దయ) కార్యరూపంధరించేందు కోసం పాటుపడుతున్న వ్యక్తి.

ఆయన శాంతి కార్యకలాపాలకూ, దేశభక్తి యుత కార్యకలాపాలకుగాను ఆయన 80 వ జన్మదినోత్సవం సందర్భంగా "ఆర్డర్ ఆఫ్ ఫ్రెండ్‌షిప్ ఆఫ్ పీపుల్స్‌ను" సోవియట్ యూనియన్ సుప్రీం సోవియట్ అధ్యక్షవర్గం 1987 ఫిబ్రవరి 13 న యిచ్చింది.

బిరుదుప్రదానోత్సవం సందర్భంగా మాస్కోలోని క్రెమ్లిన్‌లో బాందిదో-ఖాంబోలామా మాట్లాడుతూ శాంతికోసం సోవియట్ యూనియన్‌లోని సమస్త జాతులు జరుపుతున్న ఉమ్మడి ఉద్యమానికి బౌద్ధులు చేస్తున్న దోహదానికి గుర్తింపు యీ అవార్డు అని అన్నారు.

సోవియట్ శాంతికమిటీ జె.జె. ఎర్డీనెయేవ్‌కు (ఈయన ఈ సంఘంలో క్రియాశీల సభ్యుడు) "శాంతియోధ" స్వర్ణపతకాన్ని బహూకరించింది.

### ఆరు హు రల్స్

బౌద్ధులు ఏటా ఆరుగొప్ప పర్వదినాలను (హు రల్స్) జరపడం సాంప్రదాయం. ఈ పండుగల్లో అనేకమంది సామాన్యులు కూడా పెద్ద సంఖ్యలో పాల్గొంటారు. ఆనాడు జనం తమ విరాళాలను (ధనం, ఆహారపదార్థాలు, లామాలకు బహుమతులు) దాత్‌సాన్‌లకు తీసుకు వస్తారు.

మొదటిది త్సాగాల్గాన్ పండగ. దీన్ని చాంద్ర మాన నూతన సంవత్సరం ప్రవేశించే సందర్భంలో జరుపుతారు. ఈ పండగ సందర్భంగా 16 రోజుల పాటు "బుద్ధుని పన్నెండు మహాత్మ్యాల"కు అంకితమైన పూజాదికాలు జరుగుతాయి. సుఖ సౌభాగ్యాల కోసం కలిసి ప్రార్థనలు జరపడానికి వివిధ ప్రాంతాలనుండి బౌద్ధులు వస్తారు.

బౌద్ధ పీఠాధిపతి ప్రజలకు యీ నూతన సంవత్సర సందేశాన్ని యిచ్చారు. "జీవిత ఔన్నత్యం కోసమూ, భూమ్మీది సమస్త ప్రాణికోటి సుఖ సౌభాగ్యాల కోసమూ మేము కొన్నిరోజుల పాటు సూర్యోదయాన్నే ప్రార్థనలు జరపనున్నాము. బుద్ధుడు మాకు ఆవిధంగా బోధించాడు. మేమాయన ఉపదేశాలను అనుసరించడం కొనసాగిస్తాము. యిందువల్లనే

# సోవియట్ యూనియన్‌లో బౌద్ధమతస్థులు



బాందిదో-ఖాంబోలామా
జిమ్‌బా జామ్‌సో ఎర్డీనెయేవ్

చాంద్రమాన నూతన సంవత్సరదినాన్ని జరుపుతూ, శాంతి సమర్ధకుల ఐక్యతను పటిష్టం చేయాల్సింది గానూ, మానవాళికి అణ్వస్త్ర రహిత భవితవ్యాన్ని ఆవిష్కరించాల్సిందిగానూ బౌద్ధ ధర్మవలంబకులైన మీకు మేము మనవి చేస్తున్నాము. ప్రజలంతా చీకు చింతా లేకుండా, వాటికి అవకాశాలు లేకుండా జీవితురుగాక.'' దూయిన్-ఖోర్ హురల్ కాలచక్రానికి సంబంధించిన పండగ. ఇది మేలో మూడు రోజుల పాటు జరుగుతుంది. మూడవది గంగ్‌దాన్-షున్‌సెర్మె. యిది బుద్ధుని జననం, జ్ఞానోదయం, నిర్వాణాలకు అంకితమైనది. యిది వేసవి ఆరంభంలో జరుగుతుంది.

నాల్గవ హురల్ ప్రపంచ భావి బుద్ధులకు (మైదారి) అంకితమైనది. యిదెప్పుడూ నడి వేసవిలో రెండు రోజులపాటు జరుగుతుంది. మొదటి రోజు భక్తులు గంటల తరబడి ప్రార్థిస్తూ గడుపుతారు. రెండవరోజు మైదారి రథోత్సవం జరుగుతుంది.

దాత్‌సాన్‌లో జరిగే ఈరథోత్సవంలో వేలాది మంది పాల్గొంటారు. పెద్ద పెట్టున మృదంగాది వాద్య ధ్వనులూ, శంఖారావాలు వినిపిస్తాయి. ఊరేగింపు దాత్‌సాన్ గోడ ప్రతి మలుపులో పవిత్ర మంత్రోచ్చరణల నిమిత్తం ఆగుతుంది. భక్తులు రథాన్ని ముట్టుకునేందుకూ, మైదారి విగ్రహ పాదాలవైపు డబ్బు విసిరేందుకూ రథం వద్దకు వస్తారు.

చివరి రెండు హురల్‌లూ అంత ఘనంగా జరగవు. అయితే, యివి కూడా క్రిక్కిరిసిన జనం సమక్షంలో జరుగుతాయి. ఐదవది 33 వ స్వర్గం నుంచీ బుద్ధుని పునరాగమనానికి అంకితమైనది. ల్హాబాబ్ దూయిసెన్ హురల్ అనే ఈ పండుగ ఆకురాలు కాలంలో జరుగుతుంది. ఆరవ హురల్ అయిుం జూలా, ల్హామా వ్యవస్థను నెలకొల్పిన బోగ్డో జోంగ్‌ఖావా వర్ధంతినాడు అంటే చాంద్రమాసం మొదటి నెలలో 25వ దినాన జరుగుతుంది. ప్రార్థన సమయంలో వేలాది కొవ్వొత్తులు వెలిగిస్తారు.

అన్ని హురల్‌లలోను మతం కోసం పాటు వడినవారి గౌరవార్థం, ప్రజల సుఖ, సౌభాగ్య పూరిత ప్రశాంత జీవితం నిమిత్తం ప్రార్ధన జరుపుతారు.

## దాత్‌సాన్‌లు

బుర్యాతియా రాజధాని ఉల్లాన్-ఉడే సమీపంలోని ఇవోల్గిన్‌స్కీ దాత్‌సాన్‌ను అనేక దేశాల బౌద్ధమతస్థులు, పండితులు, ప్రముఖులు, పర్యాటకులు అతి తరచుగా సందర్శిస్తుంటారు.

పిల్ల తెమ్మెరలు వీస్తే చాలు ప్రధాన దేవాలయం పైకప్పు అంచుకు వేలాడదీసిన చిరుగంటలు మధురధ్వనులీనుతాయి. ఈసంఘారామ దేవాలయాలు, ఊహాకల్పిత జంతుజాల శిల్పాలు తళతళలాడే రంగులతో ముచ్చటగొల్పుతాయి.

# బౌద్ధ మతస్థులు సోవియట్ యూనియన్‌లో

గాంగ్‌దన్ దాషి చాయి ఖోర్లింగ్ ఇక్కడి ప్రధాన దేవాలయం. అతి ముఖ్య మైన ఆరాధనల కోసం ఉద్దేశించిన మూడంతస్థుల నిర్మాణమిది. నఖి ఉసానాయి సుమె అనుదిన ప్రార్ధనలకు ఉద్దేశించిన ఒక చిన్న దేవాలయం.ప్రధాన దేవాలయం వద్ద పూజా విధులకు కావలసిన వాటినన్నీ తయారు చేయడానికి కొన్ని ఇళ్ళున్నాయి. ఈ బౌద్ధారామం మధ్యలో ఒక ప్రత్యేకమైన ఉష్ణగృహంలో పవిత్ర మైన బోధి వృక్షాన్ని పెంచుతున్నారు. భారత దేశంలోని బుద్ధగయ వద్దగల బోధి వృక్షంనుంచీ విత్తును తెచ్చి ఇక్కడ నాటి పెంచుతున్న మొక్క ఇది.

ప్రధాన దేవాలయ నూతన భవనం 15 ఏళ్ళ క్రితం కట్టారు. దీని ప్రారంభోత్సవం చాంద్రమాన సంవత్సరం ఉగాదినాడు 1972 ఫిబ్రవరిలో జరిగింది. బౌద్ధుల ప్రాచీన సంప్రదాయానుసారం భవన నిర్మాతలు తమ పనికి ప్రతి ఫలం తీసుకో లేదు. ఈ కొత్త దేవాలయం పాత దానికన్నా విశాలమైనది. పూజలకూ, ప్రార్ధనలకూ మరింత అనుకూలమైనది. దీనిలో వెయ్యి బుద్ధ విగ్రహా లున్నాయి. బౌద్ధ ధర్మసంరక్షుల, సన్యాసుల మహాత్మ్యాలను చిత్రించే బొమ్మలు గోడలపై వున్నాయి. దాత్‌సాన్ ఆవరణలో ఒక గ్రంథాలయంకూడా ఉంది. వివిధ దేశాలనుండీ వచ్చిన బౌద్ధ ప్రతినిధి వర్గాలు బహూకరించిన జ్ఞాపికలుగల ఒక ప్రత్యేక భవనం కూడా ఇక్కడ ఉంది.

ఆరామంలో నివసిస్తున్న లామాలు దుల్వా అనే సాంప్రదాయికమైన కొన్ని నైతిక సూత్రాలను, ప్రవర్తనా నిబంధనలను అనుసరిస్తుంటారు. మామూలు బౌద్ధుల అభ్యర్ధనల ననుసరించి వారు ప్రత్యేక మతకర్మకాండను నిర్వహిస్తుంటారు. ప్రార్ధనల్లో, తాత్విక చర్చల్లో పాల్గొంటారు. ఇవోల్గిన్స్కి దాత్‌సాన్‌లో నేడు 30 మంది లామాలున్నారు. వీరిలో సగం మందికి పైగా యువకులు. వీరిలో ప్రతి ఒక్కరికీ విడిగా ఒక చిన్న ఇల్లు ఉంది. లామాలను వారి కాషాయవస్త్రాలను బట్టి సులభంగా గుర్తించవచ్చు. సోమ, శుక్రవారాల్లో ప్రధాన దేవాలయంలో గతించిన వారికోసం ప్రార్ధనలు జరుపుతారు. ఇతర వారాల్లో బౌద్ధమతానుయాయుల అభ్యర్ధనపై ప్రార్ధనలు పూజలు జరుగుతుంటాయి.

రష్యన్ ఫెడరేషన్‌లోని చీతా మండలంలోగల అగిన్‌స్కి స్వయం పాలిత ప్రదేశాన అగిన్‌స్కి దాత్‌సాన్ (దెచెన్ ల్హున్‌దుప్‌లింగ్) ఉంది. దీన్ని 1811-1816 లో ఆగానది ఒడ్డున కట్టారు. దాని తాత్విక పాఠశాల చిరకాలంగా ప్రసిద్ధమైంది. ఈ దాత్‌సాన్ ఒక ముఖ్యమైన గ్రంథ ప్రచురణ కేంద్రంగా పేరుమోసింది. గత శతాబ్ది చివరన ఇక్కడొక తాంత్రిక శాఖను, వైద్య పాఠశాలను నెలకొల్పారు. ఈ ఆరామ ముద్రాణాలయం 1860లో స్థాపితమైంది. తత్వశాస్త్రం తర్కశాస్త్రం, తాంత్రిక విధానాలు, వైద్యం, ఖగోళశాస్త్రం, జ్యోతిషాల్లో టిబెటన్ భాషాగ్రంథాలను యిది వెలువరించింది. దీని ప్రచురణల్లో నిఘంటువులు, జనరంజకమైన పుస్తకాలు, మంగోలియన్, బుర్యాత్ భాషలలో మత గ్రంథాలు కూడా ఉన్నాయి. ఇవన్నీ నేడు ఉల్లాన్-ఉదే మాస్కో, లెనిన్‌గ్రాడ్‌లో ప్రచురితమై సోవియట్ యూనియన్‌లోనే కాక విదేశాల్లో గల వేలాదిమంది పాఠకులకు లభ్య మవుతున్నాయి.

అగిన్‌స్కి దాత్‌సాన్ లామాలు ప్రాచీన బౌద్ధ సంప్రదాయాలను జాగ్రత్తగా కాపాడుతున్నారు. బౌద్ధుల ప్రస్తుత మతాధిపతి బాందిదో-ఖాంబోలామా, ఎర్దీనెయేవ్ అనేక సంవత్సరాలపాటు అగిన్‌స్కి దాత్‌సాన్‌లో లామాగా ఉండినవాడే. ఈ దాత్‌సాన్‌లోని గ్రంథాలయంలో బౌద్ధగ్రంథాల మాతృకలు ఎన్నో ఉన్నాయి. విదేశాల్లోని బౌద్ధులు బహూకరించిన పుస్తకాలివి.

లామాలు దేవాలయాల్లో వంతులు వారీగా పని చేస్తుంటారు. దైనందిన మత కర్మకాండను నిర్వహించడం, మతస్థుల అభ్యర్ధనపై పూజలూ, పునస్కారాలు జరిపించడం వారి పని. నూతన గృహప్రవేశ సందర్భంగానో, కుటుంబ ఆయురారోగ్యాల కోసమో, శిశు సుఖ ప్రసవ సందర్భంగానో, నూతన వధూవరుల సుఖ జీవితం కోసమో, రోగగ్రస్తుల ఆరోగ్యం కోసమో, భూమ్మీద శాంతి కోసమో ఈ పూజలు జరగడం రివాజు.

## ప్రపంచంలోని ఉద్రిక్తతా ఆలవాలాలు

# నమీబియా స్వాతంత్ర్యం దిశలో పయనం

అలెగ్జాండర్ సెరికొవ్-అలావిన్
పాత్రికేయుడు




స్వాతంత్ర్యం కావాలని డిమాండ్ చేస్తూ విండ్హోక్‌లో నమీబియన్ల ప్రదర్శన

నైరుతి ఆఫ్రికా రాజ్యమైన నమీబియా యిప్పటి శతాబ్దానికి పైగా కాలంనుండీ పరపీడనలో మగ్గుతోంది. గత డెబ్బయి యేళ్లుగా దక్షిణాఫ్రికా జాతి వివక్షతా వాదులు పాశ్చాత్య దేశాల దన్నుతో దానిపై పెత్తనం చలాయిస్తున్నారు. దేశ స్వాతంత్ర్యాన్ని తన లక్ష్యంగా ప్రకటించిన నైరుతి-ఆఫ్రికా ప్రజాసంస్థ (స్వాపో), దాని సైనిక అగ్రదళమైన నమీబియా ప్రజావిముక్తి సైన్యం (ప్లాన్) జాతి వివక్ష వాదులకు వ్యతిరేకంగా 1960 నుండి తీవ్రపోరాటం సాగిస్తోంది.

## తలపాటు

నమీబియాను అక్రమంగా ఆక్రమించుకున్న దక్షిణాఫ్రికా అక్కడ జాతి వెలివిధానాన్ని జాతి పృధక్కరణ విధానాన్ని ఆచరణలో పెట్టింది. దక్షిణాఫ్రికాలో లాగానే జాతి వివక్షతావాదులు యిక్కడ నల్లజాతి వారికి బంటుస్తాన్లను యేర్పాటు చేశారు; దేశాన్ని తెల్లజాతి వారికి అనుకూలంగా పంచారు. తెల్లజాతి వారికి దేశంలో సగభాగం, అదికూడా ఖనిజవనరులు పుష్కలంగా వున్న వ్యవసాయానికి యెంతో అనువైన ప్రాంతం లభించింది. దేశాన్ని మొత్తంగా అలానే వుంచడం సాధ్యపడకపోతే దాన్ని విభజించడానికి కూడా దక్షిణాఫ్రికా పాలకులు సిద్ధంగా వున్నారు.

స్వాపో ప్రతిష్ఠ, పలుకుబడి యీ ప్రాంతంలో నానాటికీ పెరుగుతోంది. స్వాపోకు చెందినవారని ఎవరిపై అనుమానం కలిగినా సరే వారిని జాతి వివక్షతా వాదులు తీవ్రంగా వేధిస్తున్నారు. కాని స్వాపోను నిషేధించే ధైర్యం వారికి లేకుండా పోయింది. నమీబియాలో స్వేచ్ఛగా యెన్నికలు జరిగితే స్వాపోగెలుస్తుందని పాశ్చాత్య దేశాల పత్రికలు కూడా అంగీకరించాయి. నమీబియా సమస్యకు శాంతియుత పరిష్కారం స్వేచ్ఛా యెన్నికలే. అవి దక్షిణాఫ్రికా పాలకులకు నచ్చడంలేదు. అందువల్లనే నమీబియా దేశభక్తులు తమ పోరాటాన్ని వుధృతం చేశారు.

దేశభక్తులను తిప్పికొట్టడానికి జాతి వివక్షతా వాదులు నమీబియాలో ఒక పెద్ద శిక్షాత్మక దళాన్ని పెట్టారు. "నైరుతి ఆఫ్రికా ప్రాంతీయ సైనిక దళాలు", కిరాయి మూకల యూనిట్లలోని వారి సంఖ్య యిప్పుడు 100,000 మందికి పైగా వుంది. అంటే దేశంలో 10-12 మందికి ఒక శిక్షాత్మక సైనికుడు వున్నాడు. నమీబియా భూభాగంపై దక్షిణాఫ్రికా 90 సైనిక కేంద్రాలను యేర్పాటు చేసింది.

స్వాపోకు పోటీగా మరో సంస్థను సృష్టించడానికి దక్షిణాఫ్రికా పాలకులు కేంద్రీకరించి పనిచేస్తున్నారు. దేశంలోని సరవర్గాల మధ్యగల విభేదాలను వారు యిందుకు వినియోగించుకుంటున్నారు. జాతి వివక్షతా వాదుల ప్రోత్సాహంతో అనేక చిన్నచిన్న తెగల పార్టీలు, ముఠాలు యేర్పడ్డాయి. వీటిలో చాలా వరకు దక్షిణాఫ్రికా కీలుబొమ్మలే. వీటి సహాయంతో తన వలసలో "ఆంతరంగిక పరిష్కారాన్ని" సాధించడానికి, అంటే నయావలస వాద వ్యవస్థను యేర్పాటు చేయడానికి దక్షిణాఫ్రికా ప్రయత్నిస్తోంది.

ఈవిధంగా 1985 మధ్య కాలంలో దక్షిణాఫ్రికా, యెన్నికలు యేవీ లేకుండానే తనతో రాజీ పడిన పార్టీలను అభివృద్ధి నిరోధక పార్టీలను కూడదీసి ఒక "జాతీయ అసెంబ్లీ"ని ఒక "తాత్కాలిక ప్రభుత్వాన్ని" యేర్పాటు చేసింది. యేదేమైనప్పటికీ అధికారమంతా జనరల్ అడ్మినిస్ట్రేటర్



దక్షిణాఫ్రికా ఏజెంట్లు ఒపాకటిలో పేల్చివేసిన బ్యాంకు శిథిలాలు.

చేతిలోనే వుంటుంది. యీయన అనుమతి లేనిదే ప్రభుత్వం యెలాంటి సిర్ణయాన్నికూడా అమలులో పెట్టడానికి వీలులేదు. మునుపటి లాగానే దక్షిణాఫ్రికా పాలకులు, నమీబియా విదేశీ సంబంధాలను, సైనిక విషయాలను మొత్తం తమ అధీనంలో వుంచుకున్నారు.

నమీబియా సమస్య యేనాడో అంతర్జాతీయ ప్రాధాన్యతను సంతరించుకుంది. యీ సమస్య యిప్పటికి 40 యేండ్లకు పైగా ఐ.రా.స. ఎజెండాలో వుంది. గతంలోని తీర్మానాలను, దేశంలోని పరిస్థితినీ భద్రతా మండలి పరిగణనలోకి తీసుకుని నమీబియా సమస్యకు పరిష్కారానికి పథకాన్ని సూచిస్తూ 1978లో 435వ తీర్మానాన్ని ఆమోదించింది. ఐ.రా.స. ఆధ్వర్యాన, దాని సైన్యాల సమక్షంలో ప్రజాతంత్రయుతంగా యెన్నికలు జరగాలని ఆ తీర్మానం ప్రకటించింది. ఆ పథకాన్ని పరిశీలించడానికి సుముఖంగా వున్నట్టు దక్షిణాఫ్రికా చెపుతూనే దాన్ని కాలరాస్తూ "అంతరంగిక పరిష్కారానికి" పూనుకుంది.

నమీబియాను తన హద్దుల్లో వుంచుకోడానికి దక్షిణాఫ్రికాకు యెంతో ఖర్చు అవుతోంది. శిక్షాత్మక చర్యలకు, తన కీలుబొమ్మ పాలనను నిలుపుకోడానికి రోజూ 6 మిలియన్ల ర్యాండ్స్ (1.8 మిలియన్ డాలర్లు) ఖర్చు చేస్తోంది. కానీ యీ ఖర్చు పోగా యెంతో లాభాన్ని నమీబియాలోని రాగి, జింక్, సీసం ఖనిజాలను, యురేనియం ముడి పదార్థాలను కొల్లగొట్టి సంపాదిస్తోంది.

నమీబియాలోని వనరులను తన అనుమతి లేనిదే వుపయోగించుకోవద్దని 1975లోనే ఐ.రా.స.డిక్రీ నం.1 ద్వారా నిషేధించింది. కాని దక్షిణాఫ్రికా గానీ, పాశ్చాత్య దేశాలు గానీ నమీబియాను ఆర్థికంగా కొల్లగొట్టడం మానుకోలేదు.

నమీబియా ఐక్యత, దాని ప్రాదేశిక సమగ్రత సూత్రం ప్రాతిపదికపై ఆదేశ ప్రజలకు స్వయం నిర్ణయాధికార, స్వాతంత్ర్య హక్కును యివ్వడం ద్వారానే, అధికారాలన్నిటినీ స్వాపోకు దఖలు పర్చడం ద్వారానే నమీబియా సమస్యకు పరిష్కారం సాధ్యమని సోవియట్ యూనియన్, సోషలిస్టు దేశాలు, సమస్త ప్రగతిశీల మానవాళీ భావిస్తోంది. దక్షిణాఫ్రికా, పాశ్చాత్య దేశాలు యీ పరిష్కారానికి అడ్డు తగులుతూనే వున్నాయి. యేది యేమైనప్పటికీ ఆఫ్రికాలోని యీ చిట్ట చివరి వలసలో ప్రజల స్వేచ్ఛా సంకల్పం నానాటికీ బలపడుతోంది. (ప్రావ్దానుండి)

## పుస్తక ప్రపంచం

# రష్యన్, భారతీయ క్రైస్తవ చర్చీల సంబంధాలు

*మాస్కోలోని మొలొదయా గ్వార్దియా ప్రచురణాలయం యిటీవలే "యుగయుగాలనుండి" అనే శీర్షికన చరిత్రకు సంబంధించిన వ్యాసాలతో ఒక పుస్తకాన్ని వెలువరించింది. "మిషనరీల ప్రాచీన సంబంధాలు" అనే యిందులోని ఒక వ్యాసాన్ని సంక్షిప్తంగా యీ కింద పొందు పరుస్తున్నాం. వ్యాస రచయిత కె. మత్వయేవ్.*

**రూస్** క్రైస్తవ మతం స్వీకరించిన శతాబ్ది పుత్సవాన్ని దేశ వ్యాపితంగా సోవియట్ యూనియన్ ఆర్థడాక్స్ చర్చి, సోవియట్ ప్రజలు జరుపుతున్నారు. ఆర్థడాక్స్ చర్చి అంతర్జాతీయ సంబంధాలు మరింత అభివృద్ధి చెందడానికి ఆధునిక తోడ్పడింది. రష్యన్, భారతీయ ఆర్థడాక్స్ చర్చీల మధ్య సంబంధాలు చాలా కాలంగా వున్నాయి. భారత దేశంలో క్రైస్తవ మతం క్రీ.శ. ఒకటో శతాబ్దంలో ప్రవేశించింది. భారతదేశంలో దీనికి మూల పురుషుడు సేయింట్ థామస్. ఈయన ఏసుక్రీస్తు పంపిన దూతల్లో ఒకడని చరిత్ర తెలియజేస్తోంది.

భారతీయ క్రైస్తవుల ప్రస్తావన ప్రముఖ అసిరియన్ చరిత్రకారుడు మైఖేల్ రచనల్లో మనకు లభిస్తుంది. క్రీ.శ. ఆరవ శతాబ్దంలో ప్రసిద్ధ భూగోళశాస్త్రవేత్త కొజ్మా ఇందికోప్లస్ భారతీయ నెస్టోరియన్లనూ (క్రైస్తవ మతంలోని ఒక ధోరణికి చెందినవారు), కల్లియాన్‌లో వారి బిషప్‌నూ కలుసుకున్నాడు. అప్పుడే పర్షియన్ సామ్రాజ్యంనుండి కొందరు అసిరియన్లు కేరళకు వచ్చారు. యీ పర్షియన్ క్రైస్తవులను కేరళ రాజు ఆదరించి, బ్రాహ్మణులతో సమానంగా హక్కులు మంజూరు చేశాడు.

డచ్, పోర్చుగీసు, బ్రిటిష్ వలసల ప్రభావం వల్ల భారతదేశంలోని క్రైస్తవులు అనేక శాఖలుగా విడిపోయారు. యూరపియన్ మిషనరీల కార్యకలాపాల ఫలితంగా భారతదేశ క్రైస్తవుల్లో చాలామంది కెథలిక్ చర్చిలో చేరారు. ఏదేమైనప్పటికీ ప్రాచీన భారతీయ క్రైస్తవ నెస్టోరియన్ల వారసులు పెద్ద సంఖ్యలోనే వున్నారు. వారు రోమన్ కెథలిసిజం సిద్ధాంతాలను అవలంభించారు కాని మత సంబంధమైన ఆచారాలను అట్టి పెట్టుకున్నారు. వీరిలో ఒక బృందం వారు రోమ్‌తో సంబంధాలను తెంచుకొని జాకొబైట్ సిద్ధాంతాలను అంగీకరించారు.

భారతదేశంలోని అసిరియన్ జాకొబైట్ల పాట్రియార్క్, ఆయన బృందం రష్యన్ ఆర్థోడాక్స్ చర్చిలో చేరిపోవాలనే ఆకాంక్షను వ్యక్తం చేశారు. 1844లో జెరూసలెంలోని బిషప్‌తోపాటు యీ పాట్రియార్క్ కాన్‌స్టాంటినోపుల్‌లోని రష్యన్ రాయబారి కార్యాలయాన్ని సందర్శించారు. ఆ తర్వాత సంప్రతింపులకోసం ఈరాయబారి కార్యాలయానికి సిరియాలోని అసిరియన్ జాకొబైట్ల మెట్రోపొలిటన్ పుత్రుసును పంపారు. కాని క్రిమియాయుద్ధం వల్ల సంప్రతింపులకు అంతరాయం యేర్పడింది.

1898 లో రష్యన్ సినోడ్‌కు భారతీయ జాకొబైట్లు ఒక లేఖ పంపారు. భారతీయ క్రైస్తవులు కొందరు ఆర్థోడాక్స్ చర్చిలో చేరదలిచారనీ, అందుకు సంప్రతింపులు జరపడానికి సిద్ధంగా వున్నారనీ ఆలేఖలో వుంది. అయితే యీ క్రమానికి పలురకాల అంతర్జాతీయ, జాతీయ పరమైన చిక్కులు యెదురయ్యాయి. 1917 అక్టోబరు మహావిప్లవం తర్వాత తిరిగి సంబంధాలు మొదలయ్యాయి. 1933లో ఆండ్రోనిక్ అనే మతగురువును భారతదేశానికి పంపటం జరిగింది. ఆయన తిరువాన్కూర్ రాష్ట్రంలో జాకొబైట్లతో పాటు స్థిరపడిపోయారు. భారతదేశ జాకొబైట్లు ఆర్థోడాక్సీని స్వీకరించడానికి కృతనిశ్చయంతో వున్నారని రష్యన్ ఆర్థోడాక్స్ సినోడ్‌కు ఆయన ఒక లేఖ రాశారు. దీనికి సంబంధించి నిర్దిష్ట ప్రతిపాదనలు రూపొందించేందుకు 1935లో హెలార్ ద్మిత్రి బిషప్‌ను భారతదేశానికి పంపడం జరిగింది. [illegible] సినోడ్‌కు [illegible] పంపారు. సెయింట్ థామస్ చర్చిని ఆర్థోడాక్స్ చర్చితో అధికారికంగా [illegible] సంబంధాలను పటిష్ఠం చేయడానికి 1937 లో ఆర్చి బిషప్ నెస్టర్‌ను సినోడ్ పంపింది.

ఈ స్నేహసంబంధాలు రెండవ ప్రపంచ యుద్ధ కాలంలో తిరిగి విచ్ఛిన్నమయ్యాయి. ఆర్థోడాక్సీని స్వీకరించాలనే ఆశ భారతీయ క్రైస్తవులకు యిప్పటికీ వుందనీ, స్వతంత్రప్రతిపత్తిగల చర్చికి చెందిన వారిగా భారతీయ జాకొబైట్లను రష్యన్ ఆర్థోడాక్ చర్చిలో చేర్చుకోవాలనే ప్రతిపాదనలను ధియొడొసి (భారతదేశంలోని జాకొబైట్ల బిషప్) తరఫున 1943 లో రష్యన్ పాట్రియార్క్ సెర్గియస్‌కు ఆండ్రనిక్ తెలియజేశారు.

రెండవ ప్రపంచయుద్ధం తర్వాత రష్యన్ ఆర్థోడాక్స్ చర్చి, భారతీయ జాకొబైట్లు తిరిగి తమ సంబంధాలను స్థాపించుకున్నారు. ఆర్థోడాక్స్ చర్చి 500 వ స్వతంత్ర వార్షికోత్సవం సందర్భంగా స్వతంత్ర ప్రతిపత్తిగల చర్చిల ప్రతినిధి వర్గాలు అధిపతులు 1948 లో బుఖారెస్టు సమావేశానికి హాజరయ్యారు. ఆర్థోడాక్సీతో ఐక్యం కావాలనే భారతీయ జాకొబైట్ల ఆకాంక్షను స్వతంత్ర ప్రతిపత్తిగల చర్చిల అధిపతులందరూ బలపరుస్తూ ఒక నిర్ణయం చేశారు.





కాలం గడిచినా కొద్దీ ఆ సంబంధాలు బలపడ్డాయి. ఉభయ పక్షాల ప్రతినిధులు ఇంగ్లాండ్ ([illegible]) డెన్మార్క్ (బర్హాస్)లో సమావేశమయ్యారు. భారతీయ జాకోబైట్ చర్చికి చెందిన కొత్త పాట్రియార్క్ ప్రాపన వుత్సవం సందర్భంగా భారతదేశానికి 1963 లో రష్యన్ ఆర్థోడాక్స్ చర్చి పాట్రియార్క్ అలెక్సీ తన దూతను పంపారు. 1967లో భారతీయ జాకో బైట్ చర్చి ప్రతినిధి వర్గం సోవియట్ యూనియన్‌ను సందర్శించింది. యీ ప్రతినిధి వర్గంలో కొచ్చిన్ ఎపార్కీ మెట్రోపాలిటన్ జహన్నాన్ మార్-సివిరస్, మలబార్‌లోని సేయింట్ థామస్ మెట్రోపాలిటన్ థామస్ మార్-తిమొథియోస్, థియలాజికల్ సెమినరీ ప్రొఫెసర్ ఐ.వి. జార్జి వున్నారు. తమ బృందం సంఖ్య 1,500,000 లకు పెరిగిందని యీ భారతీయ అతిథులు చెప్పారు. ఈ రెండు చర్చీల మధ్య సంబంధాలను, సయోధ్యను మరింతగా ప్రోత్సహించాల్సిన విషయాన్ని లెనిన్‌గ్రాడ్ థియొలాజికల్ అకాడమీని సందర్శించినపుడు థామస్ మార్-తియొథియోస్ మరోసారి ప్రస్తావించారు.

1953-1954లో, రష్యన్ ఆర్థొడాక్స్ చర్చి ప్రతినిధులూ, భారతీయ జాకోబైట్లు, భారతదేశంలో సమావేశమయ్యారు. ఒకచిన్న బృందాన్ని ఒక పెద్ద బృందం తనలో విలీనం చేసుకోవడం పునరైక్యపు లక్ష్యంగా వుండరాదని యీ సమావేశం అభిప్రాయపడింది. ప్రేమ ప్రాతి పదికగా విశ్వాసాల ఏకతను, శాశ్వత సోదరత్వాన్ని స్థాపించడం, స్నేహ సంబంధాలను పెంపొందించుకోవడం లక్ష్యమని యీ సమావేశం పేర్కొంది.

# ఒత్తిడి
# పరిసరాలకు సర్దుకోగల శక్తినిచ్చేసాధనం

వి. స్మిర్నోవా

"ఒత్తిడి" అనే పదంలోనే వినాశనకర మైనదేదో వున్నట్టు మనకు తోస్తుంది. కాని యిది మానవుడు తనకు తాను పరిసరాలకు సర్దుకుపోయే శక్తినివ్వగల సాధనమని ప్రవీణులు తుదకు నిర్ధారణకు వచ్చారు.

ఒత్తిడి అంటే యేమిటి? అది మనకు మిత్రుడా లేక శత్రువా? ఇది శాస్త్రీయ దృష్టితో చూడాల్సిన అంశమని ప్రపంచ మంతటా గత కొన్నేళ్ళుగా వివిధ ప్రయోగ శాలల్లో జరిపిన అధ్యయనాలు తెలియ జేస్తున్నాయి.

పర్దితులకు సర్దుకు పోయే శక్తి గుండెను —యిది ఒత్తిడి వల్ల అన్నిటికన్నా ముందు దెబ్బతినే అవయవం— యెలా కాపాడుతుందనే విషయాన్ని మొదటి సారిగా సోవియట్ యూనియన్ వైద్య శాస్త్రాల అకాడమీ (మాస్కో) తాలూకు జనరల్ పేథాలజీ, పేథాలజికల్ ఫిజియాలజీ పరిశోధనా ఇనిస్టిట్యూట్ శారీరకశాస్త్ర నిపుణుల బృందం తెలియ జేసింది. ఒత్తిడికి క్రమక్రమంగా అలవాటు పడినప్పుడు గుండె చలనానికి సంబంధించిన ఒడుదొడుకులు, అకస్మాత్తుగా గుండె ఆగిపోవడం సంభవించవని ప్రొఫెసర్ ఫెలిక్స్ మీర్సన్ మార్గదర్శకత్వాన పనిచేస్తున్న యీ బృందం పరిశీలనలో గమనించింది.

మాస్కోలోని తమ ప్రయోగశాలలో వీరు ఎలుకలపై ప్రయోగాలు చేశారు. ఒక ఎలుకను బలవంతంగా కొన్ని గంటలపాటు వెలికిల పడుకునేట్టు చేసినపుడు దానిపై బలమైన ఒత్తిడి పనిచేసింది.—గుండె, రక్తనాళాలపై భారం పడింది; ఉదరంలో పుండు యేర్పడడం మొదలైంది; కణితులు తలెత్తసాగాయి. ఎలుకలపై కొద్దిసేపు ఒత్తిడి వుంచి మరికొన్ని ప్రయోగాలు చేశారు. మొదటిరోజు 15 నిముషాలు, రెండవ రోజు 30 నిమిషాలు, అలా పెంచుతూ ఎలుకలను ఒత్తిడిలో వుంచే సమయాన్ని 60 నిమిషాల వరకు పెంచారు.

ఈ ఒత్తిడికి ఎలుక ప్రతిస్పందించి, దానిలోని వ్యవస్థలు ఒత్తిడి ప్రభావాన్ని పరిమితం చేశాయి. యీ వ్యవస్థలను ఒత్తిడిని పరిమితం చేసే వ్యవస్థలన్నాడు ప్రొఫెసర్ మీర్సన్. ఒత్తిడి వల్ల నాడీమండలంపై అధికభారం పడుతుంది. అపుడు పెద్ద మొత్తంలో హార్మోన్లు (ముఖ్యంగా అడ్రినాలిన్ హార్మోన్లు) రక్తంలోకి విడుదల కావడంవల్ల, గుండె, రక్తనాళాలు వేగంగా పనిచేయడంవల్ల శరీరంపై దుష్ప్రభావం పడుతుంది. పరిమితంచేసే వ్యవస్థలు. యీ దుష్ప్రభావాన్ని నిరోధించి, హద్దుల్లో వుంచుతాయి. దాన్ని సురక్షిత పరిమితుల్లో వుంచుతాయి. యీ దుష్ప్రభావానికి జీ:

రసాయన సంబంధమైన ప్రతిఘటన యెన్నో మార్గాల్లో జరుగుతోంది. ఉదాహరణకు ఒత్తిడి ప్రభావాన్ని నిరోధించే ప్రత్యేక అవరోధాలు మెదడులో—మార్ఫియాను పోలిన ఓపియైడ్ పెప్టైడ్స్ — యేర్పడు తాయి. గుండె కండరాల్లోని కణాల్లో ప్రధాన పదార్థాల యాంటి ఆక్సిడెంట్స్‌ల —సంయోగం జరుగుతుంది. అవి కణపు పొర దెబ్బ తినకుండా నిరోధిస్తాయి. అంటే ఒత్తిడి దుష్ప్రభావాన్ని పరిమితం చేసే వ్యవస్థలు ఒత్తిడివల్ల గట్టి పడుతాయన్న మాట.

ఒత్తిడి దుష్ప్రభావాన్ని కేంద్రనాడీ మండలం క్రమబద్ధం చేస్తుందని యిప్పటి వరకూ ప్రవీణులు భావించారు. యీ పరికల్పన సరియైనదేనా? పరిస్థితు లకు సర్దుకునే శక్తి గుండెకు వుందా అనే విషయాన్ని తెలుసుకోడానికి ప్రొఫెసర్ మీర్సన్ బృందం ప్రయోగాలు జరిపింది.

విడిగా వుంచిన గుండెపై — ఎలుక బయట పనిచేస్తూండిన గుండెపై — ప్రయోగాలు జరిపారు. ఒక ప్రత్యేక అరలో వుంచిన యీ గుండెకు రక్తనాళాలద్వారా ప్రత్యామ్నాయమైన ద్రవాన్ని సరఫరాచేశారు. తర్వాత యీ ప్రవాహాన్ని శాస్త్రజ్ఞులు నిలిపి వేశారు. అంటే గుండెతో సంబంధమున్న నాళాలను మూసి వేశారు. గుండెలో ఒక భాగం మామూలుగా పనిచేయడం నిలిచి పోయింది. గుండె క్రమం తప్పి కొట్టుకోవడం వల్ల అది నిలిచిపోయి ఆకస్మిక మరణానికి దారితీస్తుంది.

గుండెను వేరుగా వుంచి జరిపిన మరో ప్రయోగంలో ధమనులను 20 నిమిషాలు మూసివేసి తర్వాత తెరిచారు. యిలాంటి రక్త ప్రసరణ లోపానికి గుండె ఎలా ప్రతి స్పందించింది? యీ ఒత్తిడికి అలవాటు పడని ఎలుకకు సంబంధించిన గుండె అయితే అది తరచు పని చేయకుండా నిలిచిపోయింది. యిలా చేయడంవల్ల గుండె చలనం చాలా సేపు ఆగిపోయి ఎలుక చనిపోయింది. కాని ఒత్తిడికి క్రమ క్రమంగా అలవాటు పడేట్టు చేసిన ఎలు కపై యిలాంటి ప్రయోగం చేసినపుడు గుండె దృఢంగానే వుంది. గుండె క్రమం తప్పి కొట్టుకోవడం తాత్కాలికమైన చర్య గానే వుంది. కొన్ని సందర్భాల్లో మాత్రమే గుండె తిరిగి పని చేయలేదు.

ఈ దృఢత్వం ప్రభావాన్ని మరోసారి ధృవీకరించుకునేందుకు పరీక్షలను మరో దృక్కోణంనుంచి జరిపారు. కృత్రిమ జీవరసాయన ఒత్తిడిని సృష్టించడం జరిగింది. కొన్ని రోజులపాటు ప్రధాన ఒత్తిడి హార్మోన్‌ను అడ్రెనాలిన్‌ను ఎలుకల్లోకి చిన్న మోతాదుల్లో యెక్కించడం జరిగింది. యీ ప్రతి ఒక్క మోతాదుకు ఒత్తిడి దుష్ప్రభావాన్ని పరిమితం చేసే వ్యవస్థలు ప్రతిస్పందించాయి. దృఢత్వం యిందులోనే వుంది. శాస్త్రజ్ఞుల పరికల్పనను యీ ప్రయోగాలు పూర్తిగా ధృవపరిచాయి జీవరసాయన పరంగా దృఢత్వాన్ని సమకూర్చిన తర్వాత అరలోని గుండెకూడ రక్త ప్రసరణలోపాన్ని తట్టుకొని నిల్చింది. వ్యతిరేక ప్రభావానికి గురిచేయబడిన అవయవపు స్వయం నియంత్రణ, మొత్తం శరీరం అలాంటి పరిస్థితులకు అలవాటు పడిపోయేట్టు చేయడంలో గొప్ప పాత్ర నిర్వహిస్తుంది.

అందువల్ల ఒత్తిడి స్వయంగా ఒత్తిడిని యెదుర్కొనడానికి తోడ్పడుతుంది. కీలెరిగి వాత పెట్టాలనే సామెత వుంది కదా! అయితే ఒకమాట. శరీరాన్ని దృఢతరం చేసే పనిని జాగ్రత్తగా క్రమక్రమంగా నిర్వ హించాలి.

# బెయితె శ్మశానవాటిక రేకెత్తిస్తున్న కొత్త ప్రశ్నలు

ఎల్ గాల్కిన్

కాస్పియన్ సముద్ర తూర్పుతీరంపైగల షెవ్‌చెంకో నగరం సమీపంలోని బెయితెలో అనేక శిల్పాలను పురావస్తు శాస్త్రవేత్తలు కనుగొన్నారు. వాటినక్కడ ఎవరు ఉంచారు? ఎప్పుడుంచారు? ఎందుకుంచారు?

ఇక్కడ మూడు సమాధి దిబ్బల సమూహాలు (ఒక్కొక్క సమూహంలో మూడు నుంచీ నాలుగు సమాది దిబ్బల చొప్పున) ఐదు చదరపు కిలోమీటర్ల స్థలంలో ఉన్నాయి. మొదటి సమూహంలో (బెయితె-I) మూడు సమాధి దిబ్బలున్నాయి. ప్రధానమైన ''రాజు'' సమాధి దిబ్బకు (దీని యెత్తు దాదాపు నాలుగు మీటర్లు వ్యాసం నలభై మీటర్లు) 120 మీటర్ల దూరంలో అనేక రాతి శిల్పాలు ఉన్నాయి. యివి కనీసం 25 ఉంటాయని ప్రాథమిక అంచనాలు తెలుపుతున్నాయి. యీ శిల్పాలు ఈశాన్య దిశాభి ముఖంగా వున్నాయి.

బెయితే శిల్పాల ఖండాలు

బెయితె-IIలో సమాధి దిబ్బల సమీపాన శిల్పాలు లేవు.

మూడవ సమూహంలో (బెయితె-III) మూడు సమాధి దిబ్బలున్నాయి. అక్కడా ఒక "రాజు" సమాధి దిబ్బ ఉంది. దాని ఎత్తు దాదాపు నాలుగు మీటర్లు. వ్యాసం 40-50 మీటర్లు. అయితే దీంట్లో శిల్పాలు మొదటి సమూహంలో వలెకాక, వాయువ్య దిశాభిముఖంగా ఉన్నాయి. ఇక్కడ కనీసం 50 రాతి ప్రతిమలనూ, రెండు రాతి బలి పీఠాలను, ఒక రాతి పళ్లేన్ని పురావస్తు శాస్త్రవేత్తలు కనుగొన్నారు.

అన్నిటికన్నా కొట్టవచ్చినట్లు కన్పించేది ఈ శిల్పాలన్నీ విరిగిపోయి ఉండటం. ఈ శిల్పాల తలలను శరీరం నుండీ వేరు చేయడానికి కావాలని ప్రయత్నం చేసిన విషయం స్పష్టం. పురావస్తు శాస్త్రవేత్త అయిన కజకేవిచ్ 1930లో రాసిన విషయం ఇక్కడ ఉటంకించడం ఉచితం: "బాగా మేస్తున్న పశువులు బలియకుండా ఉంటే మేము విగ్రహాల తలలు విరగగొట్టే వాళ్ళం అని మంగోలియన్లు తరచు అనడం విన్నాను". దిష్టి తగులుతుందన్న భయం వంటిదే యిది కూడా

పైపైన చూచినా మనకు కనిపించే రెండో విషయం ఏమిటంటే కొన్ని శిల్పాలు గుండ్రంగానూ, కొన్ని బల్ల పరుపుగానూ ఉండటం. గుండ్రంగా ఉండే శిల్పాల సంఖ్య యెక్కువ. వీటిని మానవ దేహం ఆకారంలో చెక్కారు. మిగిలిన బల్ల పరుపు శిల్పాలు నైరూప్య శిల్పకళావతుగా కోణాకారంలో వున్నాయి.

ఎల్.గాల్కిన్

ఇతర తేడాలు కూడా కొన్ని ఉన్నాయి. కొన్ని ప్రతిమల్లో విశాలమైన భుజాలు, సన్నని నడుము ఉండగా మిగిలిన వాటి అవయవాలు మామూలుగా ఉన్నాయి.

విగ్రహాల ఎత్తులోకూడ తేడాలు గణనీయంగా ఉన్నాయి.

మూడవ విషయం. విగ్రహాలపై సైనికుల బెల్టులు, కృపాణాలూ, బాకులు, విల్లంబులు, టీ కప్పులు, కంటెలు, కడియాలు చెక్కారు. ఈవిగ్రహాలకు శిరస్త్రాణాలు చెక్కి ఉన్నాయి. పీటి మీసాలు చుబుకం వైపుకు వంపు తిరిగి ఉన్నాయి. ఈ విగ్రహాలపై చెక్కిన ఆయుధాలు—కృపాణాలూ, బాకులు వంటివి క్రీస్తు పూర్వం 4-3 శతాబ్దాల నాటివని రుజువు చేస్తున్నాయి. ఈ శిల్పాలన్నీ సూర్యుడు అస్తమించే దిశ అయిన వాయువ్య దిశాభిముఖంగా వుంటటం ఒక విశేషం.

ఈ స్మశాన వాటికలు ఎవరివి? యిది మొట్ట మొదటి కీలకమైన ప్రశ్న. వీరు శాకా, మాసగెటై తెగకు చెందిన వారని నేను ఊహిస్తున్నాను. బెయితె-I లోని ఒక సమాధి దిబ్బ తవ్వకాల్లో లభించిన సమాచారం నా ఊహకు ఆధారం. ఒకరాతి పూజాపీఠంతో సహా ఒక రాతి పెట్టెను పురావస్తు శాస్త్ర వేత్తలు కనుగొన్నారు. దీనిలోని విలువైన వస్తువును ప్రాచీన కాలంలో యెవరో కొల్ల గొట్టుకు పోయినట్టు కనిపిస్తోంది. యిలాంటి పూజా పీఠాలే ఆరల్ సముద్ర ఈశాన్యం తీరంలో గల శాకాల స్మశాన వాటికల్లోనూ, షెవ్‌చెంకో శివార్ల లోని ఇనుప యుగారంభం నాటి సమాధి దిబ్బల లోనూ కనిపించాయి. ఈ రెండు చోట్ల ఉత్తర క్రియలు ఒకే రకంగా ఉన్నాయి. యివి ఆరల్ సముద్ర సమీప ప్రాంతంలో కాస్పియన్ సముద్ర ఈశాన్యం వైపున నివసించిన మాసగెటై తెగవారు అనుసరించే మరణానంతర కర్మకాండా విశేషమని పురావస్తు శాస్త్రవేత్త, వి.యాగోదిన్ అభిప్రాయం.

కాబట్టి మనకు మొదటి ప్రశ్నకు సమాధానం లభించింది.

బెయితె స్మశాన వాటిక కాస్పియన్ సముద్రానికి తూర్పు ప్రాంతంలో విస్తరించిన ఇనుప యుగంనాటి సమాధి నిర్మాణాల సుదీర్ఘ పరంపరలో ఒక కొలికి.

తెగ ముద్రగల విగ్రహాలున్న ఆస్మశాన వాటికలు, రాజ్య వ్యవస్థకు ఆనాటి సమాజం పరివర్తన చెందు తుండేదనే దానికి సూచన. ఆ విగ్రహాలు వారి

పూర్వీకులవి, వీరులవి. ఆరల్ మండలంలోని కారా-కాల్పాక్ జాతివారి, ఖోరెజ్మ్‌లో నివసిస్తున్న ఉజ్బెక్ జాతివారి ఆధునిక జానపద గీతాలు ఇనుప యుగారంభం నాడు ఆరల్, కాస్పియన్ మండలాల్లో నివసిస్తూండిన శకాల మాసగెటై తెగవారి గాథలకు సంబంధించినవేనని పరిశోధకుల అభిప్రాయం.

మొత్తం సిథియన్ సార్మాషియన్ ప్రపంచంలో ఉన్నన్ని విగ్రహాలు బెయితె స్మశానవాటికల్లో ఉన్నాయి. సార్మాషియన్ శిల్పం బోస్పొరస్ ప్రాంతం బయట అభివృద్ధి చెందలేదన్న వాదన నిజంకాదని యిది నిరూపిస్తోంది. కృపాణాలు, బాకులు, విల్లులు, బెల్టులు, మెడకంటెలు, కడియాలు మొదలైన వాటిని కంచుయుగం నాటినుంచి యూరేషియన్ స్టెప్పీ పశుపాలకులంతా చిత్రించారు. మాసగెటై శిల్పాలపై సిథియన్ శిల్పకళ ప్రభావం వుందన్న సిద్ధాంతం తప్పని ఈపరిశీలనల వల్ల తెలుతోంది. అయితే వాటికి ఉమ్మడి సాంప్రదాయాలు ఉన్నాయి. ఆదర్శప్రాయమైన పురుషుల సౌందర్య చిత్రణ యిందుకొక ఉదాహరణ. సిథియన్, బెయితె శిల్పాలు రెంటిలోను విశాలమైన భుజాలు సన్నని నడు మూగల సైనికుల విగ్రహాలు ఉన్నాయి. ఈ సాంప్ర దాయం ప్రాచ్య ప్రపంచంనుండీ, బహుశా, చాలావ రకు ఇరాన్‌నుంచీ వచ్చి ఉంటుందని నమ్ము తున్నారు.

బెయితె శిల్పుల నైపుణ్యం, అభిరుచులపై ప్రాచీన గ్రీకు, రోమన్ సాంప్రదాయాల ప్రభావం కూడా ఉంది. కాస్పియన్ సముద్ర ఉత్తర, తూర్పు తీర ప్రాంతవాసులతో ప్రాచీన గ్రీకు, రోమన్‌లకు ప్రత్యక్ష సంబంధాలు ఉండేవనేది విస్పష్టం. కాస్పియన్, ఓల్గా ప్రాంత సర్మాషియన్ స్టెప్పీల నడిబొడ్డున తీరప్రాంతపు ప్రాచీన గ్రీకు, రోమన్ నాణేలు కనిపించడం యాదృచ్ఛికం కాదు.

విగ్రహాలుగల అస్థిక పేటికల నిర్మాణం క్రీస్తు పూర్వం 4వ శతాబ్ది, క్రీస్తుశకం 2వ శతాబ్ది మధ్యలో ఖోరెజ్మ్‌లో సంప్రదాయంగా ఉం్ది. ఆప్రాంతానికి బెయితె సమాధులున్న ప్రదేశం దగ్గరగా ఉండటం, దానిపై ప్రాచ్య ప్రపంచ ప్రభావానికి కారణం.

బెయితె సమాధులన్నింటినీ పరిశీలించడానికి ఏండ్లు పడుతుంది. ఇప్పటివరకూ సమాధానాలకన్నా ప్రశ్నలే యెక్కువగా ఉన్నాయి. అయితే, మనం నూతన విషయాల ఆవిష్కరణ పథంలో ఉన్నాం.

(జ్నానియే-శిలా పత్రిక నుంచి సంక్షిప్తం)





నేను అధికారం చలాయించిన 30 యేళ్లలో ప్రజలు తమంత తాముగా సమావేశం కావడం చూడలేదు. నానగరంలో యిప్పటికే రెండు ప్రద ర్శనలు జరిగాయి. ఆప్రదర్శకులు నేరుగా నాకే విజ్ఞాపన పత్రాలిచ్చారు. స్వచ్ఛమైన గాలి లేదట, నగరంలోని ఫ్యాక్టరీని మూసెయ్యాలట, ఏం చోద్యం! కాలం మనది కాదు, జనాన్ని సంతోషపె ట్టడానికి చిరునవ్వు తెచ్చుకుని సానుభూతిని ప్రకటించాను. గతం గుర్తొస్తోంది. యెంతమంచి రోజులో. చూసి రమ్మంటే, కాల్చి వచ్చే వాణ్ణి. నాయకుని అభిమతం తెలుసుకుని వ్యవహరిస్తే చాలు, మనకు తిరుగు వుండేది కాదు. ఉదయం ప్రచురించిన తీర్మానానికి సాయంత్రానికల్లా యావ న్మంది ప్రజల మద్దతును సమకూర్చడమే మనపంతు. యేదైన పర్వదినం సమీపిస్తే, దానికి సన్నాహాలు చేయడమే మన పని. ఆవిధంగా నాకు రోజూ పండుగే.

1985 ఏప్రిల్‌లో నేను మరో వుద్యమం చేపట్టాను. కుళ్లి కంపు కొడుతున్న పాత గాలిని మార్చడానికి కొత్తగాలి కావాలి, కిటికీలు బార్లా తెరవండని అరిచాను. కాని సంవత్సరం తర్వాత యిందులోని ప్రమాదాన్ని గ్రహించాను. ఇది నాకే ఎసరు పెట్టే ట్టుంది. పత్రికలకిచ్చిన స్వేచ్ఛవల్ల పరిస్థితి చెయ్యి దాటి పోయింది. అధికార్ల తొలగింపు పరంపర ప్రారంభమైంది. నిజంగా యెంత ఘోరం. మాస్కోలో వున్న నా మిత్రుడొకడు నా చెవిలో ఊదాడు: "నూతన సరళిని ప్రదర్శించు, లేకపోతే నీరాజ భోగాలకు నూరేళ్లు నిండుతాయి". ఈ "నూతన సరళి" యేమిటో యెవరికీ తెలియదు.

ఉదాహరణకు, చొరవలను ప్రోత్సహించండి అనే ఆజ్ఞ ఒకటుంది. కాని ఆచొరవలేమిటో తెలిపే జాబితా యెక్కడుంది? "అది నిర్ణయించాల్సింది నీవే" అని అంటున్నారు. ఇది మరీ ప్రమాదకరం. ఒకవేళ నా నిర్ణయం తప్పని తేలితేనో. అందుకే "మరింత స్వేచ్ఛ" అనే నినాదం మునుగులో

# సీనియర్ అధికారి స్వగతం

లియొనిద్ ట్రెయర్



చిత్ర రచన:

దాక్కొని "మీరు నిర్ణయించండి" అని నా దిగువ అధికార్లకు పంపాను. వారు ఎవరూ కాదనలేదు, కాని ఎవరూ బాధ్యత తీసుకోలేదు. ఎవడైనా ఆ పనిచేస్తే దొరికి పోయినట్టే.

ఈరోజుల్లో నాయకులెవరూ ప్రసంగాలను చదవడంలేదు; ఆశువుగా ప్రసంగిస్తున్నారు. తాను స్వతంత్రంగా ఆలోచిస్తున్నట్లు ప్రజలు అనుకోవాలి కదా. అదీ వారి బాధ. నేనూ ఆశువుగానే ప్రసంగిస్తున్నాను. అయితే ఎలా ప్రసంగించాలో యింటి వద్ద భట్టీ పడుతున్నాను. పొరపాటున గతాన్ని గురించిన ప్రశంసలేమైనా దొల్లకుండా వుండడానికే యీ అవస్థ. నా మిత్రుడొకడు యిలాంటి పొరపాటు చేసి వుద్యోగానికి నీళ్లు తెచ్చుకున్నాడు.

పాత అలవాట్లు వదిలి పోవడం చాలా కష్టం. నేను వేదిక యెక్కితే చాలు, చపట్ల వర్షం కురుస్తుంది. యిప్పటికీ నేనంటే ప్రజలకు భయమే. అందువల్ల నన్ను విమర్శించడానికి కొందర్ని నియమించుకోవాల్సి వచ్చింది. ఒకసారే మైందో తెలుసా? వ్యవసాయ విభాగానికి చెందిన యార్త్సెవ్, నేను యిచ్చిన భరోసాతో హద్దు పద్దు లేకుండా నన్ను విమర్శించాడు. పెరిస్త్రోయికాను మాటల్లోనే కాని చేతల్లో బలపర్చడం లేదన్నాడు. సభలోని వారు దీన్ని సహించలేక పోయారు. యార్త్సెవ్‌ను క్షమాపణ కోరమన్నారు. అంతేకాదు వెనుక బడ్డ ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రానికి తనను పంపి శిక్ష విధించాలని యార్త్సెవ్ స్వయంగా ప్రతిపాదించేట్టు చేశారు. పాపం యార్త్సెవ్.

ప్రజలను కలుసుకోవడం నా జీవితానికి కొత్త. ఇది నాకు అసలే గిట్టదు. అయితే ప్రధాన కార్యదర్శే చౌకుల్లో ప్రజలతో మాట్లాడుతున్నాడాయే, నేనేంచేయాలి? మొదట నేను చౌకుకు బస్సులో వెళ్లడానికి ప్రయత్నించాను. కాని జనం నన్ను తొక్కి చావగొట్టినంత పని చేశారు. యిది నానుండి అయ్యేపని కాదని కారులో వారానికొకసారి వెళ్తున్నాను. ప్రతిసారి అక్కడ సుమారు 50 మంది నిరీక్షిస్తుంటారు. "మీ ఆదాయమెంత? ఆహార సరఫరాలు బాగున్నాయా?" అని పాత పద్ధతుల్లో కుశల ప్రశ్నలు వేశాను; అంతే, "అన్నముంటే సరి పోతుందా? మాకు యిది లేదు, అదిలేదు, మీరైతే మంచి యిళ్లలో వుంటారు" అని ఓ ముసలి పీనుగ విరుచుక పడ్డాడు. ఆయన మాటలను శ్రద్ధతో ఆలకించినట్టు నటించాను. అలాంటి విషయాలు దృష్టికి తెచ్చినందుకు అభినందించాను. మీరెప్పుడైనా సరే నన్ను వచ్చి కలువొచ్చని వీపు తట్టాను. ఆయన సరేనన్నాడు. అంతే ఆయన కనిపిస్తే ఒట్టు.

ఆలోచనా స్వేచ్ఛ అంటున్నారే, దానితోనే వచ్చింది పేచీ అంతా. ఇటీవలే నేను పెరిస్త్రోయికా క్లబ్బుకు వెళ్లాను. ఇది నిజంగా వ్యాధుల పుట్ట. ఒకరేమో పలురకాల అభిప్రాయాలు కావాలంటారు. మరొకరేమో ప్రత్యక్ష ఎన్నికలంటారు. మూడవ వాడేమో వ్యక్తి పూజ తిరిగి తలెత్తకుండా - హామీ కావాలంటాడు. ఇంకో ఆయన లేచి నాయకులు చనిపోయిన తర్వాత నేనా వారిని ఉతికేదీ, వారి తప్పులను వెతికేది? అని ప్రశ్నించాడు. వీరంద రినీ "గెటౌట్" అని అనాల్సిందే, కాని అలా అనలేదు. చురుకుగా వ్యవహరిస్తున్నందుకు మెచ్చుకున్నాను. "కామ్రేడ్స్, ముందుకు సాగండి. మరో మార్గంలేదు. యెంతటికైనా ఒడ్డి పెరిస్త్రోయి కాను గెలిపించాలి" అని వారికి సలహా యిచ్చా.

వారంతా భేష్ అంటూ చప్పట్లు కొట్టారు. కాని ఆరాత్రి నాకు ఒంటి గంట వరకూ నిద్రపట్టలేదు. "ఓదేవుడా, నీవంటూ వుంటే స్తబ్దతా కాలాన్ని తిరిగి రప్పించు. మూసపోత భావాలు, యేక వ్యక్తి మేనేజిమెంటులో నన్ను ప్రశాంతంగా జీవించ నిమ్ము. ప్రజాస్వామ్యం నుండి నన్ను కాపాడు. ఒకవేళ పెరిస్త్రోయికా వదలని పీడ అయితే దాన్ని కనీసం యిరవై యేళ్లపాటు వాయిదా పడే ట్టు చూడు" అని ప్రార్థించాను.

## ప్రత్యేక సమాచారం

"నువ్వు యెందుకు, యెలా నవ్వుతావో చెప్తే నువ్వెవరో నేను చెప్తాను" అని సోవియట్ ప్రజలు అంటూంటారు. ఇందులో రవ్వంత నిజం లేక పోలేదు. భౌగోళిక, శీతోష్ణస్థితులను బట్టి నవ్వు యెన్నో రకాలు: ఉత్తరాది, బాల్టిక్ రిపబ్లిక్కుల్లోని ప్రజలు నిగ్రహించుకుంటున్న రీతిలో నవ్వుతారు. ఎందుకు నవ్వుతున్నారో వారికి తెలుసు. దక్షిణ ప్రాంతంలోని పరిస్థితి యిందుకు భిన్నం. ప్రజలు బిగ్గరగా, ఉత్సాహంగా నవ్వుతారు—హాస్యం అర్థమైనా, కాకపోయినా. అసలు నవ్వు పుట్టించేది యేదీ లేకపోయినా సరే".

ఉక్రేయినియన్ పట్టణమైన సూమీకి చెందిన ఫోటోగ్రాఫర్ ఎ. కేజెంకో సోవియట్ బ్యూరాక్రాట్ చివరి రోజులను చిత్రించిన తీరు యిది.

## టూకీగా

### ఏడు దశాబ్దాల సోవియట్ పేయింటింగ్స్

సోవియట్ ఆర్టిస్టు వీక్టర్ పొపేకవ్ (1932-1974) గీసిన బొమ్మల్లో మంచి సమతూకం కనిపిస్తుంది. ఆయన జిలుగు రంగులు వాడరు. కానీ ఆయన గీచిన బొమ్మలు సోవియట్ ప్రజల నైతికాదర్శాలను ధ్రువపరుస్తూ జీవిత పరమార్థాన్ని తెలిపే ప్రగాఢ ఆలోచనలతో నిండి వుంటాయి. పారిస్‌లో 1967లో ఆయన ఎగ్జిబిషన్‌కు గ్రాండ్ ప్రీ బహుమతి లభించింది.





**మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక**

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | KRSA102M278 |
| పుస్తకం పేరు | సోవియట్ సమీక్ష |
| తారీఖు | 23 February 2025 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 69 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | no |
| లేని పేజీలు | no |
| తయారు చేసినది | mary |
| పేజీలు విడదీసినది | mary |
| స్కాన్ చేసినది | akshaya |
| పరీక్ష చేసినది | NANDINI |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |